# కాత్యాయనీగ్రంథమాల, తణుకు.



ఇం దపూర్వములగు పురాణములు, కావ్యములు, నాటకములు, శతకములు మాఁడుమాసముల కొకటి ప్రకటింపఁబడును.

మాగ్రంథములన్నియు నొక్కమాఱు చదివి పాఱవేయఁదగినవి కాక, చదివినకొలఁదిని నూతనానుభవముఁ గలిగించుచుఁ బాఠకులను రసనిమగ్నులనుగఁ జేయునవియై యుండును. సదాచారశిక్షను బడయఁగోరు ప్రతియువకుఁడును, సాహిత్యసౌందర్యము ననుభవింపఁగోరు ప్రతిరసికుఁడును, ధర్మమార్గాసక్తిగల ప్రతివృద్ధుఁడును మాగ్రంథములవలన నెక్కువలాభముఁ గాంచెదరు.

మాగ్రంథమాలకు విరాళముగా నొకేసారి ముందుగా రు 11 లొసఁగువారలు మహారాజపోషకు లనియు, రు 50 లిచ్చువారల రాజపోషకులనియు, రు 25 లిచ్చువారలు పోషకు లనియు, రు 10 లిచ్చువార లభిమానులనియుఁ బరిగణింపఁబడి వారినామములు ప్రతిగ్రంథమునందును బ్రకటించి తద్గ్రంథముల వారి కుచితముగ నొసఁగఁబడును.

రు 0-4-0 లు ప్రవేశరుసు మిచ్చి చందాదారులుగఁ జేరువారలకు ప్రతిగ్రంథము వి. పి. పోష్టుద్వారా పంపెదము. ఈచందా సంవత్సరమునకు పోస్టేజీగాక రు 3 లకు మించియుండదు. రు 3 లొకేసారి ముందుగా యిచ్చినవారికి పోస్టేజీ మేము భరించెదము. కానఁ బ్రతివారును మాగ్రంథమాలకు చందాదారులుగఁ జేరి మాయుద్యమమునకుఁ దోడ్పడుదురుగాక.

దివాకర్ల వేంకటావధాని,
తంగిరాల జగన్నాథశాస్త్రి,
సంపాదకులు.

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పాణిగృహీత

ఇది

## శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడినది.

రెండవ కూర్పు.

కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలలో

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

 1929 [దీనివెల [illegible]



తిరుపతి వేంకటేశ్వరులు,

శతావధానులు.

# ఉపోద్ఘాతము.



ఈకల్పితప్రబంధము పుచ్చా సీతారామయ్యగారి కంకితమీయఁబడినది. ఇది యధికప్రయత్నముచేఁగను బలవంతపెట్టి యతఁడే రచియింపఁజేసినాఁడు. తుదకు జరుగకపోయినను మాకాయన చేయఁదలంచుకొన్న బహుమానము వేయిన్నినూటపదార్లు. ప్రకృతము కృతినేత మృతిచెందినను దీనిరచించి వినిపించినపిదప నాలుగుసంవత్సరములవఱకును చక్కఁగాజీవించియుండి మొదటఁ బ్రతిశ్రుత మొనర్చినధనము నీఁజాలక యేదోమిషపెట్టి నానాటికి మాకు విసుపుపుట్టించి "ఇఁకనితఁడు సన్మానించినను స్వీకరింపఁగూడ" దనునభిప్రాయమును బూర్తిగాఁగలిగించి యట్టి యుత్తరముగూడ మావలననందుకొనెను. ప్రబంధమును చిత్తుకాగితములమీఁదనే పుస్తకమును బూర్తిగావిని పరమానందమునంది వెంటనే యచ్చొత్తింప నెంతోయత్నమొనర్చి "సమ్మానానంతరమునఁ గాని ముద్రణమునకు వలనుగా" దని మేమడ్డుపెట్టుటచే నించుకయాగ్రహించి పైమొత్తమునకు నోటొకటి వ్రాసియంపెను. వెంటనే దానిపై వసూలుపెట్టి తిరుగఁగొట్టితిమి. పదపడి కొన్నాళ్ళు బందరుపురమున్ననే యుండెనుగాని ధనలోపముచే సమ్మానము మాత్రము జరిగింపఁజాలఁడయ్యె. అనంతరము తన యగ్రహారగ్రామమగు సిరిపురమునకు వాసముమార్చికొని యటనుండి యుత్తరముల మూలమున సమ్మానించు నభిప్రాయమును వెలిపుచ్చుఁజొచ్చెనుగాని దైవమనుకూలింపమిచేఁ గృతార్థుఁడుమాత్రము కానేరఁడయ్యె, తక్కినవిషయము లెట్లున్నను నితఁడు ధనవ్యయమునకు మాత్రమించుకయు వెనుదీయువాఁడుకాఁడు. దాతృత్వముతోపాటుగా నవ్యవస్థిత చిత్తత్వమీతనికి సహజగుణము. "అవ్యవస్థిత చిత్తస్యప్రసా

దోషీ భయాంకరః" అనికదా? పెద్దలు చెప్పుదురు. కావున నిట్టివానికంకిత ముగాఁగృతిచెప్పుట మాలోపమేయని మేమువ్రాయకున్నను లోకము నిశ్చయించుకొనక యెట్లుమానును ? ఇతఁడంతలో దైవవశమున మృతిచెందెను గాని జీవించియున్నను సన్మానము చేయఁజాలడనియే మా నమ్మకము. సన్మానముకేమి ? అతఁడెట్టివాఁడైనను "యశముకొఱకుఁగదా? అతిప్రయత్నమునఁగృతిచెప్పించుకొనుట" యనియూహించి "మరణాంతాని వైరాణి" యనుమాట స్మరించి యీమాకన్యక నతని పేరుమీఁదనే ప్రకటించితిమి. వితంతూద్వాహమంతగాఁ దప్పులేనియిక్కాలమ్మున నీకన్యకకు బాల్యవైధవ్య మనుభవింపవలసినంత నిర్బంధను లేశమును లేదు గాని యేమైనను నన్యథాకరించుటకు మనసొప్పినదికాదు. దీనిని సహగమనము చేయించవలెనను నూహా గూడ నుదయించినది కాని, యదియిప్పటిశాసనమునకు విరుద్ధమని తిరిగి యణగిపోయినది. పదపడి యీవిశ్వస్తకు భరణప్రాప్తికలుగునను కింవదంతి కలిగినది. "కాకమాంసంశునోచ్ఛిష్టంస్వల్పంతదపి దుర్లభం" అనురీతి నున్న యా భరణమునందును మాకృతికన్యకిష్టము లేదు.... గుణదోషాదులు రసజ్ఞలోకమే నిర్ణయింపఁగలదుగదా ? యని...... ............యింతతో నీయంశమును ముగించుచున్నాము.

తిరుపతి వేంకటేశ్వరులు.

# ద్వితీయ ముద్రణపీఠిక.



చదువరులారా ?

ఈ కబ్బమునుగూర్చి వ్రాయఁదగు నంశములన్నియు మొదటి పీఠికయందే వ్రాయఁబడియుండుటచే నిప్పుడు నూతనముగా నిందు వ్రాయఁదగు నంశము లెవ్వియును లేవు. కాని ముద్రాయంత్రమునందలి యక్షరములు బొత్తిగా నలిగియుంటచేఁ బ్రతిపుటయందును నెన్నియో యంటనిచోట్లు కలవు. అందు "ం, న, వ, మ, గ, వి, ఈయక్షరములు చాలభాగ మంటనేలేదు. మఱికొన్ని యక్షరములుకూడ నంటనివికలవుగాని వీనివలె బొత్తిగానంటకపోలేదు. ఇఁక ప్రూఫుచూచువారి ప్రమాదమువలనఁ గలిగిన లోపములుమాత్రమీ క్రిందఁ జూపి విరమించుచున్నాఁడను.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 2 | కఁట | కట |
| 6 | 4 | నేమమూ | నేమమో |
| 6 | 20 | భంబు | భంపు |
| 8 | 12 | స్లైక | న్లైక |
| 8 | 23 | గఱ్తు | గుర్తు |
| 8 | 24 | జాతి | జాతికి |
| 14 | 18 | లోగ | లోఁగ |
| 15 | 23 | యియ్యౄ | యిమ్యౄ |
| 19 | 3 | జ తి | జంతి |
| 19 | 12 | బెంకి | బెంకె |
| 20 | 14 | ల్గాలి | ల్గాల |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 24 | 24 | నొక్కు | కొక్కు |
| 25 | 6 | లుదు | లను |
| 26 | 27 | వ్యా | వ్యాని |
| 27 | 11 | ఁగుటిఁ | గుటి |
| 27 | 15 | గోర | గోరి |
| 30 | 13 | నిచ్చలు | నిచ్చల |
| 33 | 24 | గ్గుఁడ | గ్గుండ |
| 34 | 8 | బిడ | బిడి |
| 38 | 9 | తఁగా | తిఁగా |
| 38 | 9 | మురన్ | మున్ |
| 38 | 15 | యముమున్ | యముం |
| 39 | 10 | దజతె | దఁజల్లె |
| 42 | 1 | మురన్ | ముకుం స్ఫుఁదుముర |
| 44 | 7 | చెప్పిశ | చెప్పినన |
| 46 | 9 | చెనటి | చెనఁటి |
| 46 | 27 | నీటి | నీటు |
| 47 | 4 | భుజఁగు | భుజగు |
| 50 | 8 | దుంచు | తుండు |
| 50 | 10 | నది | నయది |
| 51 | 3 | లేద | లేవ |
| 51 | 20 | నొక్కి | నొప్ప |
| 52 | 4 | బోవ్రు | వోవు |
| 54 | 17 | టొక్కు | టొప్పు |
| 58 | 1 | సల్సె | సల్పె |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 58 | 4 | సూపి | జూపి |
| 59 | 10 | పటుందు | పటుంచు |
| 60 | 2 | జన | దన ? |
| 61 | 5 | జల | బల |
| 62 | 3 | యిచు | యించు |
| 66 | 10 | స్యాందా | స్యానందా |
| 68 | 23 | వేళ్ళనో | వేనోళ్ళ |
| 70 | 10 | దేని | డేసి |
| 70 | 11 | గుర్రై | గుర్రై |
| 76 | 7 | మీాతని | మాతని |
| 77 | 22 | సంపు | సంపు |
| 78 | 4 | త్రోష | రోష |
| 83 | 23 | ట్టుల | నట్టుల |
| 88 | 24 | చవు | చనవు |

ఈ చూపినవి ముఖ్యమైన ప్రమాదములు అంటలేదని మొదట సూచించిన పూర్ణానుస్వారములోనగునవి దిద్దనేలేదు. అవి తఱచుగా బ్రాసిస్థానమందుఁగూడ నున్నవి. కావున దిద్దకున్నను సులభముగాఁ బ్రాసస్థానమందుఁగూడ నున్నది. కావున దిద్దకున్నను సులభముగాఁ దెలిసికోవచ్చును. అట్టివి కొన్ని యితరస్థలములయందును గలవు. ప్రాజ్ఞులే ప్రమాణమని యుపేక్షింపఁబడియె.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.



శ్రీమత్పరదేవతాయై నమః.

# పాణిగృహీత.

(తిరుపతివేంకటీయము.)

## ప్రథమాశ్వాసము.



శ్రీదుం డాప్తుఁడు. గౌరి భార్య, యచలశ్రేష్ఠుండు మామ, వి
ఘ్నాదుల్ వారెపెడివాఁడు పుత్రుఁడు, శుభం బర్పించుశబ్దమ్ము పే
రై దైవారెడివేల్పు నిత్యకరుణావ్యాప్తుండు పుచ్ఛాశ్వయుక్
దాఁ దాత్పర్య మెలర్పఁ బ్రోచు నలసీతారామనామాంకితుక్. 1

చ. గురు వగు బ్రహ్మపండితునకు న్నతిసల్పి జగత్ప్రసిద్ధవా
గురు లగుసంస్కృతాంధ్రకవియోగుల మ్రొక్కియు నేఁటి మేటులన్
గరము బహూకరించి యిఁకఁ గాకవితాభువనైకరాజ్యభా
స్వరులగు వామమాత్రకవిచంద్రులకున్ బొనరింతు మంజలుల్. 2

తే. గీ. లజ్జ గల్గిన పూర్వకాలమ్మునందుఁ, గోటి, కొక్కఁడు గల్గెఁబో! కుకవి, నేఁటి
కాలమం దేమికర్మమో కవులనాఁటఁ, దొంబదుగు కుపదమ్మునఁ దూఁగుచుండ్రి. 8

ఉ. కైత యొకండు గా దిపుడు కాలము సర్వము మారె వ్యర్థపుం
జాతురి హెచ్చె నల్ప వగుసాహితితోఁ బెదపెద్దపాత్రముల్
చూతురు తప్పు దిద్దురు, కూరత చచ్చెఁ గవీంద్రులందు సీ!
మాతులు గట్టిపెట్టికొనఁ బోలదె? సత్కవులైనవారికిన్. 4

చ. తగుదుమొ లేదొ యంచు మదిఁ దత్తరపాటొకయింత లేక "మీ
దగుకయితమ్ము నూటితిమి యుం దది యుం దిది" యంచుఁ బద్దముల్
దగులుతు రందుకోసమె మొదల్ దమ రంపుదు రిక్కవుల్ వృథా
యగుఁగద? వీరిసమ్మతు, లహో! తగుపౌరికి వేల? కాల్ప నే. 5

తే. గీ. అన్నిపాత్రమ్ములకు మొద లెన్ని పట్టులో, నింక నభినందనములతో దండుగ కట
యొక్కఁడేనియు నిజముగు నూహ వ్రాయఁ, డట్లు వ్రాసిన నద్దాని నడఁతు రొకఁటు. 6

తే. గీ. భారతముపై నెవరి యభిప్రాయ ముండె, మనుచరిత మొద లేరి సమ్మతులు నిలిచెఁ
దీపి లేని ఫలమ్ముపైఁ దేనెచిలుక, నేమి యగుఁ దీపి గలదాని కేమి వలయు. 7

తే. గీ. చేతఁ గాని శతావధాని చేతి డ, సర్టిఫికెట్లు కట్టలే, సహజశక్తి
గలుగువారల, కవి యేల? కాల్పనే స్వతఃప్రకాశుఁడు గోరునే? తనకు దివ్వె 8

క. "సంగీతసాహిత్యులు వా, గంగనకుఁ గుచము" లనుట "హాస్యాస్పద" మం
చుం గన్నులుగా దిద్దెడి, శృంగారవిదుల్ కవీంద్రు లిక్కాలమునన్. 9

ఉ. ఇంతకు నింత మాత్రమె యిఁక నన్నయనంబులు గూడఁ జూడ నా
ప్రాఁతవి లోట మోటు మఱిఁ గాళ్ళగ మాత్రలొ వ్రేళ్ళటందురో
తాఁ త్రిణికాఫలమ్ము లనఁ దీఱదె? పూర్వకవీంద్రు లక్కటా!
యింత వివేకముం దెలియరే? యది దిద్దెడిపాటివారమే? 10

క. ప్రసవశల్యపరీక్షకుఁ బో, యిన ఫలముం గలదె! వాని నిటు పోల్చవలె
యద్యసఘునిభావము నెఱిఁగిన, జనుఁ డేగతి దిద్దు? నది రసం బెటు లిచ్చున్. 11

తే. గీ. ఇంతమార్దవ మెఱిఁగియు నిహిహి! వీరు, బాలకుల కంచుఁ జేసిన పాఠపుస్త
కము నసుఖరోగములగ థ నిము డఁ జేసి, రటు నుపాధ్యాయు లెటు చెప్పఁగుదురో? యకట!

ఉ. కంకురుకుంక లైనపలుగాకికలార్థుల కెట్లు పాత మీ
యంకపురాణముల్ నయభరప్రద మంచు వచింప నొప్పు? నా
శంక రొయునర్పరే? నగరె? "సత్యము నీతికె" యందురేని మీ
సాంకునిఁ జెల్పు నాఁకతిఁ వాక్యము పాఠము కెట్టరాదొకో! 13

తే. గీ. తగినసామగ్రి దొరకిన ధార లేదు, ధార గల్గిన సామగ్రి దవరఁ బోదు
రెండు గల్గిన వారితో నొండు గెల్వ, వారు డీకొన నది నగుఁబాటు గాదె? 14

ఉ. కొంచెము గొప్ప సంతసము గొల్పినఁ జూడుఁడు చించివేయుఁడే
మంచియు లేనిచో, నివియె మా నమనమ్ము, లనుగ్రహించి మ
న్నించుఁడు కాశినాథబుధనేతవిధాన వృథావివాదముల్
పెంచకుఁ డాగ్రహించకుఁడు "పెన్నిషే" యందురు మేటి దర్కొనన్. 15

చ. పరిణతశక్తు లైన యలభారతపుంగవు లట్టు లుండ ము
మ్మారుఁ దనిపించుకొన్న కవిసామజసింహము రామకృష్ణ వా
గ్విరచనగూడఁ జూడుఁడు ప్రవేశఫలమ్ములు చిన్న చిన్న వ్యా
కరణపుఁబొత్తముల్ గొణిగి కయ్యముఁ బెంచకుఁడయ్య! వాగ్విదుల్. 16

క. తొలిబాసయందుఁబలె నీ, తెలుఁగుంబాస వెలయించుదీపము లేమిన్
విలువఁగలకవులలక్ష్య, మ్ములె తా మిభారమెల్ల మోయఁగవలయున్. 17

క. ఈభాగము మేమల దే, వీభాగవతమ్మునందు వివరించితి మీ
క్షోభ యిట మరల నేల? ప, రాభవ మందకుఁడు పైకి రాకుఁడు కుకవుల్. 18

ఉ. కాలముఁ బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షాలలితాంగి మాటు విది సత్కవిసమ్మత మాట నవ్యదే
శ్యాలను నాంధ్రభాషఁ గలపాటును నాచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మని పండితు లేగతి నొప్పరందురో. 19

మ. అగుఁ గావ్య మ్మికి, యైనను బ్రహసనప్రాయమ్ము, ప్రారంభమా
దిగ దీనన్ బలుచోటులన్ బోసఁగు నెంతేనిన్ రసాభాసు, లో
మగునన్ వాయికచేఁత, దుర్నిటులనిర్మర్యాదవాక్యమ్ము, లొ
ప్పుగ దానిన్ వెలయించుఁ బండితులు తప్పుల్ దిద్దరేమో కదా! 20

తే. గీ. కవిత యన్నపు డెవరివాగ్రచన యెట్లొ, దాని కనుకృతి సేయుటే తగినఫణితి
అంతియే కాని యెల్లెడ ననుగుణపు, శైలి కల్పించు టది యేట్రిచంద మగునొ? 21

తే. గీ. మాలపల్లె వర్ణించుచో మహనుదులను, జెప్పఁగతి దుర్నిటులు వాడుతప్పుకాఁత
లెంతమృదువుగా మార్చినఁ గొంతయైనఁ, బచ్చి యుండక మాన దప్పట్ల నిజము. 22

క. అనరాదు గాని యప్పక, విని "గనులన్ జనలు మొదలు వేయఁదగని" వ
చనియె నివి భారతాదులఁ, గనుఁగొనెనో లేదో, శతము గన్నదు నకటా! 23

ఉ. తా నొనరించుకట్టునకుఁ దప్పినపొత్తము లెన్నియెన్నియో
మానుగ లక్ష్యసంగతుల మన్ననచేసి యదేమిపాపమో!
మానెను బోతరాజకవిమండనువాగమృతంబు గ్రోలితే,
కైనను దోసముల్ గలవె? యయ్యెడఁ జక్కఁగఁ జూచువారికిన్. 24

ఉ. ఱాపడు రేఫయుక్ జెలిమి రాదని పెద్దనవాద మెంచెఁ దా
నేకతనుండి వ్రాసెనొ కవీంద్రుఁడు నన్నయ, కల్పమాని నా
రే? తవు లొక్కరే, యుభయరేఫలె యివ్వి? నఱల్, తిఱల్, లడల్,
గాక యభేద మీయొకటి గా? తగకుండుట, మేలు మేల్! బళీ! 25

శా. శ్రీనాథాదుల రేఫలోపములఁ దర్కించెన్, కలాభేదసం
ధానంబున్ దెగఁద్రెంచె దిద్ది, యది గన్నన్ సవ్వరే! శాబ్దికుల్,
తా నేయేయువి తేవనెన్ దనకు సంతర్వాణి లౌసత్కవీ
శానుల్ వాడిరి విస్తరించుటకు శాస్త్రం బెట్లు పీ లియ్యెడన్. 26

క. ఎఱిఁగి ప్రయోగించిరదో, యెఱుఁగనిదో తెలియవలయు నిచ్చో నలవ్యా
కరణపుభావ్యములో వ్రా, సిరి చీవా ట్లిడిరి లక్ష్యసిద్ధి దెలుపుచున్. 27

క. ఎన్నెన్ని పాత్తములు కవు, లెన్నెన్ని విధాలఁ జెప్పి రెన్నెన్ని విశే
షోన్నతు లరయ్యడఁ గన్పడు, నన్నియుఁ దెలియంగ శక్యమా? యొక్కనికిన్. 28

తే. గీ. వాడిదౌర్బల్యమే కాని లేదు వాద, దుర్బలత్వము, లక్ష్యముల్ దొరక వరట
బొత్తిగాఁ దప్పు, తెలుఁగున బొంకి రిట్లు, సంస్కృతమ్మున నింతగా సాగ దాట 29

ఉ. ఇంతకుఁ బోతరాజకవి నీకఁడు దాఁ బహివెట్టె దానిచే
నింత లిఖింపఁగావలసె నిందుకుఁ దిమ్మకవీంద్రుఁ డేమి, ను
స్వాంతుల తక్కలాక్షణికు లందఱు నేమి, యెదిర్చి యక్కవిన్
గాంచితిఁ దెచ్చి గప్పకవి కా దనుమాత్రములోనఁ బోయెనే. 30

మ. యతియో ప్రాసయొ తప్పు జేరికిని రాదా? దానఁ బాండిత్యవి
స్ఫురితిన్ లోపమె? భ్రాంతి పండితులకే, "యేవార్థమప్యర్థయ"
న్మృతిపూర్వోక్తి దలంపుఁ డొందఱును దా మీపూర్వపుంబొత్తముల్
వతి మన్ముఖ్యులు దిద్దకే కలిగెఁ బ్రామాణ్యమ్ము, యోజింపుఁడీ. 31

ఉ. వారికి నిచ్చరమ్ము గతి వారును వారును దిద్దరేని యా
భారతమాదిగాఁ దెలుఁగుబాసను సంస్కృతమందు నొక్కటే
దారిని బోవు పాఠములు, దానికిఁ గారణ మేమి? యిప్డు ము
ద్రారచనాలయమ్ములను దప్పులకుప్పలు కొన్ని చొప్పడున్. 32

వ. అని శిష్టాచారచ్ఛలమ్మున నాత్రిప్రాయమ్ము గనించక చర్చించి యొక్కఁడఁ గార్య
వశమ్మున బృందావనపురమ్మున కరుగుటయు నయ్యెడ నాబాల్యమిత్త్రుండును నవా
దిపవిత్రతర పుచ్ఛావంశసంభూతుండును గానరసకోవిదుండును గవితామాధురీధురీ
ణుండును నగు సీతారామనామకవిప్రధనదతనూజుం డొక్కఁడు.

ఉ. తా నొకహార్మనిక్ ఖ్రీతిసుతారముగాఁ దగు దాని నూని డెం
దానకుఁ బ్రీతి గొల్పఁగతిఁ దానముఁ బల్కఁగఁ జేయుచున్ మతిన్
దానికి వేఱు గానికతిఁ దఁబుర మీటుచుఁ గొంద ఱెల్ల "రా
నా" ననురీతిఁ బాడ నది హాయిగ వించుఁ దదేకచిత్తుఁడై. 34

వ. కొండొకసేపు విస్మృతసకలప్రపంచుండై కాలక్షేప మ్మొనరించి చిఱునవ్వు నవ్వు
చు భక్తిపురస్సరమ్ముగా నిట్లనియెను. 35

చ. "తిరుపతివేంకటేశ్వరులు తియ్యనిమాటలతోడ నూరి పా
మరులకు మెచ్చుగాఁ గవిత మంచిగఁ జెప్పెద" రంచు వించు సం
బరపడుచుంటె కాని యొకపాటిప్రబంధము నైనఁ గైకొనన్
జిరమునసుండి యత్నమును జేసియుఁ గానయితిన్ గృతార్థుఁడన్. 36

తే. గీ. ఆత్మకూరునృపాలునియట్లు మిమ్ము, నేనుఁ గంబారి నెక్కింప నేమొ కాని
తక్కసమ్మాన మొనరింపఁ దగినపాత్రి, సిరి గలదు సుంతు నాకు లచ్చిపతికరుణ. 37

చ. అన విని "నీ కొసంగు టొకయబ్బురమే? మఱి విత్త్రిలందు కేల్
ధనమున దాతృతాగరిమఁ దక్కఁ ప్రశంసల నాఁటినాఁటఁ ద
క్కిన గలరే! నినున్ దొరయఁ గీర్తిపరుల్, కయికొ మ్మవశ్యమున్
మనమున శిష్టమైనకృతి మాన్యతమున్ దగుదాని" నావుడున్. 38

ఉ. ఇప్పటికెంత లేదనిన నిర్వదికిన్ బయినుండు మీకృతుల్
తప్పక సేయు శాశతవధానపుఁబద్దెములున్ నృపాళిపై
గుప్పినపద్యముల్ గలవు కొల్లలు, భాగవతంబు దీనిలో
గొప్పది, దానినేను మనుగోరితి, నీ యుకపోతి రెందుకో! 39

మ. ఋతువుల్ పర్వతముల్ సముద్రములు నీరేజాకరమ్ముల్ శత
క్రతుముఖ్యామరసంఘముల్ తఱచుగాఁ గబ్బమ్ములఁ జెప్పెదన్.

కుత్సితులన్ దన్పుచునంటఁజేసి యిఁకనేఁ జోద్యమ్ముగా నూత్న పుం
గృతి నిర్మింపఁగఁగోరెదన్ నయమునన్ శృంగారమున్ మీఱఁగన్. 40

చ. మనుజున కెద్దిసారె యొకతె మానినియుండుట యొప్పునో? కుల
మ్మునకనుకూలమైన విధిబోధిణి యంచొక నేమమా? యటన్
జనమున నెంచిచూడ నెట మంచియిహమ్మునఁ బరమ్ము వారదో?
వినవలె దీనికెంతయును వీలగు గాథ రచింపుఁ డొప్పఁగన్. 41

వ. అని సకర్పూరతాంబూలమ్ము నెట్టి యంబరాద్యర్పణమ్ముల సంతుష్టిగావించుటయు
నలరి యతని డెందమ్ము చందమ్ము గుఱుతెఱింగియు మఱింత విశదీకరింపఁదలంచి
యతనిన్ గూర్చి. 42

ఉ. పాణిగృహీతి యందురు వివాహితయైనసతిన్, దనంతఁ దాఁ
బాణి గ్రహించి యుంచుకొను బానిసతొత్తును శాబ్దికాగ్రిణుల్
పాణిగృహీత యందు రొక వర్గమునందు నెకాక యెన్నిరో
పాణిగృహీతికిన్ గలవు పాణిగృహీతకునన్ బ్రిభేదముల్. 43

ఉ. దున్నయు నేమఁగున్ సరిగఁ దూఁగునె? యంచయుఁ గొంగ యొందు నే
న్నఁడుగాని సాటిగను నే? మఱియెక్కడి కెక్కి? దక్కటా!
వన్నియ వాసియున్ సుపథవర్తనమున్ జెలువారుభార్యకున్
మున్న రికంపుఁదొత్తువకు మాధుతెఱంగఁగ లే గహో? విటుల్. 44

వ. అన నతం డిట్లను.

చ. విటులకు బుద్ధివచ్చుగతి వేశ్యలకున్ దలవంపుగా విశం
కటపదగుంభనమ్ములను గాక కడున్ సులభంబుశైలి నొ
క్కటి రచియింపుఁడీ? కృతిని గైకొనఁ జిన్నటనాఁటనుండి మి
క్కుటముగ నన్ను నెక్కొలుపుకోరిక లిప్పటి కీరికల్ గనన్. 46

వ. అనుటయు.

ఉ. ఇందుకు గ్రంథజాలము లనేకములున్నవి దుష్ప్రవర్తనం
బందుఁ బురాకృతంపుసుకృతాతిశయమ్మునఁ గాలువెట్టకే
డే దము తక్కియుండవలె డెప్పఁగనై యటుగాక తక్కినన్
విందుమె? యెందు నేనియును వెన్కకుఁ దీయఁగఁ జేయుకబ్బముల్. 46

చ. సుకృతపుబుద్ధి మాఁకుబడ సుందరియే గురువంచుఁ దోఁచు దు
ష్కృతులె యాగమమ్ములగు జావళులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కగ్గలమై కగుజక్కునమ్మనం,
దొకనికి బుద్ధిమార్పడక యుండుఁ బురాకృతపుణ్యసంపదన్. ౪౭

వ. అయినను బాటించువార లసదని నీతన్ బోధింపమానఁదగదు గాన నీమనోరథంబు చొ
ప్పున నట్లన చెప్పెదమని యంగీకరించి యాచారయ్య కతనఁ గృతినేతయగు నతని
వంశమెట్టిదో కొంత వర్ణించెదము. ౪౮

బ్రహ్మముఖోత్పన్నంబై యొప్పుచు ప్రశస్తికెక్కు నాదిమవర్ణంబునం దొక యవాంత
రశాఖ యగు వెలనాటి వంగడమ్మునందు గౌతమసగోత్రమ్మున "పుచ్చా" వామక వంశ
మ్మున ననేకులు మహామహు లుద్భవించి యశమును గాంచి మించిరి. అందుఁ గాల
క్రమమ్మున విశ్వనాథభొట్లు సుధన్యుండుదయించె, నియ్యనఘునికి విశ్వేశ్వర సోమయా
జులు జనించి యఖండ పండితుండై ప్రశస్తిన దుకుయే కాక దంతులూరను నొక
యగ్రహారంబు సంపాదించె. నీమహనీయు కొమరుండు లక్ష్మీనారాయణశాస్త్రి,
ఈతనికి వెంకటసోమయాజియు, విశ్వేశ్వర సోమయాజియు, సీతారామ సోమయా
జియు, లక్ష్మీపతి సోమయాజియు, కామేశ్వరసోమయాజియు ననునేగురు సార్థక
నాము లుదయించిరి. అందుఁ గనిష్ఠునకు శీతారామశాస్త్రి, రామయ్య, రాజయ్య
అను సుతత్రితయ మావిర్భవించె. వీరిలో రామయ్యకు పూర్ణయ్య, లక్ష్మీనారాయణ,
కృష్ణయ్య, శ్రీరాములు, విశ్వనాథము ననునేవురు సుతులుదయించిరి. ఈనైదుగు
రును సుప్రసిద్ధులే యైనను నిందు ద్వితీయుండగు లక్ష్మీనారాయణాహ్వయుండు
స్వార్జితాఖండసంపత్సంపన్నుండును నిరతాన్న దాన నిరతుండును మహావదాన్యుం
డునునై మిగుల యశమునందె, ఈయన్నదాతయే బెజవాడలో సత్రముంచిన పరోప
కారి ఈతని యన్నదాన మహత్త్వముంగూర్చి యేమి యితరయోగ్యతలను గూర్చి
యేమి యెంతయైనను వ్రాయవలసియే యుండును. ఈతండనపత్యుం డగుకతనఁ దన
పిన్నతమ్ముండగు శ్రీరాముని కుమారుని దత్తుఁగాఁ జిన్ననాఁడె గైకొనియె. ఆతని
పేరు సీతారామయ్య, ఈయనకుఁ గన్నతల్లి జోగాంబ, పెంపుడుతల్లి లక్ష్మాంబ
ధర్మపత్ని లక్ష్మీదేవి, వీరలందఱును సద్గుణసంపన్నలు, ఈవంశము వేదవేదాంగాది
విద్యలకు నాకర మనియు తద్విహిత కర్మానుష్ఠానమునకుఁ గుదురనియు నిందలి

మహాపురుషుల నామములే కొన్ని సహస్రముఖముల వాక్రుచ్చుటంజేసి యావిష
యమును మరల విస్తరించుట పునరుక్తియని యాజోలికిఁబోక యీయన్వయమునం
దెల్ల నెక్కుడు త్యాగభోగరాయఁడని లోకులచే నెన్నఁబడు సీతారామాహ్వయుం
డీకృతికి నధినేత కావున నారసికునకు నభ్యుదయ పరంపరాభివృద్ధిగా మాయొనర్చెన్
బూనిన పాణిగృహీతయను కల్పిత ప్రబంధమ్మునకుఁ గథాక్రమంబు. 29

ఉ. పత్తన మెక్కుఁడొప్పు "హరిపావకముఖ్య దిగీశలోక సం
పత్తులకెల్ల నొక్కయెడఁ బద్మభవుం డిరవొందు చేయఁగాఁ
జిత్తమునన్ దలంచి యిది చేసె నిజ" మ్మని యెల్ల పాండితీ
వేత్తలు దన్నుతింప నరవిందసమాఖ్యఁ బరిమళించుచున్. 50

మ. నదికిం దాళఁటు చుట్టుపట్టులను నానందమ్ము పుట్టించుచె
ల్వావవన్ వత్తిలు తోఁటలొప్పునఁట వాయుప్రేరణన్ సౌరభా
భ్యుదయం బెప్పటికప్పు డుండునఁట యే యుద్యోగము న్లేక సౌ
ఖ్యదశన్ జీవన మయ్యెడన్ గలదఁట య్యం బట్టి యొం డుండునే? 51

ఆ. వె. లచ్చి యెల్లవేళలను నందుఁ గాపుర, మ్ముండుకతన దాని కొదవునట్టె
పేరు సార్థకంపుఁ బెంపునఁదగె నేతి, బీరకాయరీతి నీరసిలక. 52

తే. గీ. వెండికొండల మాదిరి వెల్లదీవు, లవిధమున మల్లెపూలరాశి వడఁపునను
సంతత సుధామహోల్లసత్సౌధ పటలి, కనులపండువు సేయునక్కటకసీమ.

మ. కనకమ్మన్నను లొట్టమన్న నరిగాఁ గ్గొంచు నవ్యాంగనన్
జవరింగాఁ దలపోయుచున్ నిగమవిశ్వాసమ్ము పోనీక నె
మ్మనమెల్లప్డు విరాగమంద యిడ ధర్మప్రక్రియన్ బొల్చి తా
మనసూయా పరులౌట నతు్రలుసుమీ? యాగ్రపోలి విప్రోత్తముల్. 54

చ. అరిమదభంజనమ్మనవ యాగ్రహ, మాగ్రహ మబ్బినప్పుడున్
శరణనువారిఁ బ్రోచుట యశమ్మను జ్ఞానపు మేలిగుత్తు, సం
సరణమసారమం చెఱుక, క్షత్రియజాతిఁ బెట్టెసొమ్ముల
ప్పురమున, నేల శూన్యమయి పోవు నిహమ్ముఁ బరమ్ము వారికిన్ఁ 55

తే. గీ. సాధుసజ్జన నామముల్ సంతరించి, నట్టి తమపూర్వపురుషుల యశము చూడి
కాని క్షత్రియకృత్యమ్ము కైకొనంగఁ, దగుదు రప్పురికోమటుల్ ధనదసములు. 56

ఉ. ఎండలవేళ దున్న రది యొద్దులగాసికి హేతువంచు, బ్రి
హ్మాండము క్రిందుమీఁదయిన నాడినమాటకుఁ దిద్దులేదు ప
ట్టాండలు రామసచ్చరిత గాక యనేకపురాణజాలముల్
మెండుగఁ దామెఱింగిన సుమేధసు లప్పురి నున్నపాదజుల్. 57

తే. గీ. పూవులమ్మెటఁ గని పుష్పలావికలని, గుఱుతుపట్టుదురే కానిగోనబుతనపుఁ
బలుకులను మేనితళుకులఁ గులుకుఁజూపు, లౌర! వారాంగన లటన్న యాసగొలుపు

మ. ఎలనీటిన్ బురణించు నీర్గలిగి తా మేకాలమం దింక క
ప్పులతోనిండియు నూరకే యెవరినిన్ బోనీక పంకమ్ము లో
పలనున్ దాల్పక యోగిచిత్తములలేవన్ బొల్చు నవ్వీటి బా
వులు గన్గొన్న మహెట్టి పాంథులకుఁ బోవున్ మేనితాయాసముల్. 59

తే గీ. శాంతియార్జించుపొంటె వేదాంతములను, జదువనేటికి? శమకునై జపతపమ్ము
లూననేటికి? నప్పురినున్న మత్తగజముల ప్రవర్తనముఁగన్నఁ గలుగవోకొ. 60

క. తమసహజుఁ డుచ్చపదవిన్, గొమరారుట తాముక్రిందఁ గుప్పుకుటయు నైఁ
పమి నచటి సైంధవములు న, భముపయికిన్ దుముకు దవ్వుకువారెసిపట్లన్. 61

ఉ. తాళి యొకండు లేదనెడి తప్పిద మొక్కటితప్ప గేహినీ
లీలలఁ దమ్ముఁజేకొనిన లేఁతబొజుంగులఁ దన్పుచున్ గళా
శాలిను లౌటకున్ ఫల మసత్యము దూరముచేయుం దద్ధన
స్త్రీలు నిజమ్ము లంజెలఁ బతివ్రత లన్న మతేమి దోసమా. 62

ఉ. అందొక భూసురుండు సకలాగమవేత్త యనాదిసుప్రసి
ద్ధం దగువంశమున్ మతియుం దీప్తికిఁ దెచ్చెడి సద్గుణప్రజం
బంది చెలంగువాఁడు నిరతాన్నవితీర్ణికి నాటపట్టు న
స్పందితచిత్తవర్తనుఁడు భాసిలు శంకరుఁ డన్న పేరునన్. 63

మ. పరకాంతాపరకీయవిత్తహరణప్రారంభముల్ సేయుము
ష్కరులన్ వీనులఁబెట్టఁ డొక్కయెడఁ బ్రాక్పుణ్యమ్మునన్ జేసి ద
గ్గఱిన్ విన్నను హా! శివా! యనుచు లోఁ గంపించుటే కాక య
ద్దురితంబున్ బెడఁబాపఁ జేసికొను నెందున్ లేని సత్కర్మముల్. 64

ఉ. వైదికుఁడయ్యు లౌకికప్రవర్తనమందును బ్రజ్ఞ గల్గి సం
పాదనచేసె లక్షలకుఁ బైఁ గడు హెచ్చుగు ద్రవ్య, మగ్రిజ
శ్రీపతి నిట్లు గాంచియును జిత్తజుబారికి లోఁగియుండఁడే వే
ఱేనియు నేని దుర్వ్యసన మేర్పడియుండ దయింపఁ డింతయుఁగా. 65

సీ. కట్టించె మిక్కిలిఁ జక్కనిరీతి నన్నదానము సల్పఁబెట్టిసత్రములగములు
చేయించె నెంతయో చేసాచి యడిగిన బ్రహ్మచారులకు వివాహములను
శివకేశవులకు హెచ్చినభక్తి నూరూర నమరఁగాఁ జేసె దేవాలయములు
వేయించె ధర్మార్థమై యింపుపొంపారఁబట్టి తోఁటలు నూటికన్న హెచ్చు;

తే. గీ. యజ్ఞములు సేయఁజేసెఁ బైనందెఁ గృతుల, నగ్రహారమ్ము లొకకొన్ని యాచరించెఁ
దిక్కులిఁక లేవు సప్తసంతానములను, నొక్కసంతానమే లేకయుండెఁ గాని 66

ఉ. ఆతనిభార్య యందులకె యాత్మ సదా దిగులొందుచున్ బురా
రాతికి గౌరికిన్ సిరికి రాక్షసవైరికి వాణికిన్ సదా
ధాతకుఁ దిక్కువేల్పుల కెదన్ ముద మిచ్చు వ్రతమ్ము లెన్నియో
చేతికొలంది దానములు సేయుచుఁ జేసెఁ బ్రియుండు మెచ్చఁగన్. 67

వ. ఇట్లు పతివ్రత యనేక కాలమ్ము నానావ్రతమ్ము లొనర్చియు వివిధదేవపదమ్ములఁ
గ్రుంకులిడియుఁ దుదకు విసువుపుట్టియు నతండు 68

క. "అన్నతనూజునకును దాఁ, గన్నతనూజునకు భేదగతి గల్గునె?" యం
చున్నతరూపవిశాలుఁడు, సన్నయుఁ దనయన్న కొడుకు సాఁకఁగ నెంచెన్. 69

తే. గీ. ఎంచి తనభార్యఁ గాంచి యిట్టులనియె, "గలికి! యెన్నాళ్లిటు కష్టపడి నోర్చి
కల్పములనన్న వ్రతములు కడఁగిచేతు?, విధి పురాకృతకర్మమ్ము నెట్టులడఁచు? 70

వ. సంతానమ్ము లేకయుండుట యిహలోకానందమ్మునకె కొంతఁగలిగించుఁ గాని పర
మ్మునకించుకయు భంజకమ్ము గానేరదు "అపుత్రస్య గతిర్నాస్తి" యని కేవలకర్మ
ఠులు చెప్పుదురే కాని యద్దాని జ్ఞాను లొప్పరు. 71

తే. గీ. ముక్తినందెడి వానికి ముఖ్యమొక్క, జ్ఞానమగుగాని యితరమ్ము గాదు దాని
నెనయలేమందు నొకపాటిహీనమతుల, కయ్యదియు నొక్క తెరువని యెఱుఁగు సభల.

సీ. భీష్మున కెందఱుబిడ్డలు పుట్టిరి? శుకయోగి కెందఱు సుతులువాడమి ?
రల యాంజనేయున కాత్మజు లెందఱు? గణపతి కేపాటి కాన్పుగలదు ?
పైవారలందఱు పడిరె? దుర్గతుల, సంతానమ్ముగల్గనెందఱు మనుష్యు
లిపుడు పిశాచాది హీనజన్మమ్ముల నెత్తుట లే దింతయేల? పుత్రుఁ 72

తే. గీ. డెంతయును యోగ్యుఁడగునేని యిహమునందుఁ
దమకుఁ బరిచర్య సలుపుట దక్కఁ బరము
నందొకింతయుఁ గాఁడు సహాయుఁ డొక్క
యెడల నగునందువేని నీ విదియు వినుము. 73

వ. పుత్త్రునివలన ముక్తిగలుగునని చెప్పెడిపురాణమ్ములే వారు పదితెఱంగులని యా
నందు దత్తుఁడును బరగతికి సాధన మ్మగుననియు ఘోషించుచున్నయవి
కావున. 74

క. నాయన్నకు సుతులెందఱొ, శ్రీయుతు లున్నారు మొన్న చిన్నసుతుఁడొకం
డాయుర్భాగ్యసమన్వితుఁ, డై యుద్భవమందె వాని నగుఁ గైకొనఁగన్. 75

వ. ఉదారుం డను పేరున నొప్పు వానికిప్పుడు వయస్సు మూడునెలలగుటయుఁ గర్మ
వశమ్మునఁ దలిదండ్రు లిరువురు గతించుటయు నీ వెఱుంగనిది కాదుగదా ! అట్టి
శిశువుఁ బోషించుటయె మనకు నిహపరలోకమ్ములకు సాధనంబగునప్పు డన్యానికి
మనసకలసంపత్తులుంగూడ నొసంగుట యెట్టి సుకృతం బొనఁగూర్ప నేరదు ?
మఱియు నొక్కవిశేషంబు గల దాకర్ణింపుము. 76

చ. కనఁగవతీరు నెమ్మొగము కాంతియుఁ జెక్కులసౌరు నాసయొ
ప్పును నళికంబు చందమును ముద్దులు గుల్కెడి లేఁతనవ్వుపె
ల్లును వెడఁదైన పేరురమువాఁడిమియుం గని సిమిసిమిన్ జెలంగు మే
నును గన వానిఁ బ్రాకృతజనుం డనబోల దొకించుకేనియున్. 77

ఆ. వె. "ఎచట రూపముబ్బు నచటన గొనములు,సంభవించు"నను చు శాస్త్రవిదులు
పల్కుచుంద్రు రింకఁ బనిలేదు యోజింప, వాని స్వీకరింపవలయు ననుచు

చ॥ పతిఁగని యిట్లు పల్కు నలపావని "యోయనఘాత్మ! మీరలా
నతి యిడి నప్పుడే యదియు నాకును సమ్మతమైన నిందులో

వెదకిన దోసముల్ గలవు వీఱేకులై యొకసాఁకి వానిచే
సతమును గుందుమన్న మనుజన్ముల నెందఱిఁ జూడ మిద్ధరన్. 79

చ. కలిగినవాఁడు యోగ్యుఁడగుఁ గాక యయోగ్యుఁడె యౌనుగాక తా
మలుఁగరు తల్లిదండ్రు, లతఁ డాడిన దాటఁగ సాగఁజేతు ర
న్యుల నిఁక వన్నె భేద మొకఁ డుండుటచే మఱి యెంతమందియో
కలిగిన మీఁదనైనఁ దమ కానుపులన్ బలెఁ జూడ రెవ్వరున్. 80

చ. అమలిన బుద్ధితోడఁ దమ సత్యము రాగము మీఱఁ జూచినన్
గ్రమమున సత్తు వాఁడొకఁడు గన్పడఁ డేఁటి నేని యేరిలో
పమునని భేద మబ్బుట ధ్రువం, బటు గావున దత్తపుత్రితో
కమునకు స్వర్గలం బకుటకన్న నుపేక్ష కెట్టి యున్నదే. 81

ఉ. వాఁడొక వేళ నత్తిఁను వానితలోదరి యత్త దేగతిన్
గూడెడి సౌఖ్య? మెట్టు లొనగూడెడి? సంసరణమ్ము, లేనిచో
లేఁ దనువంత యొక్కటియ తే దికరం, బిటులైన సంస్కృతుల్
పాడగఁ జెల్లుగ్రెడి వివాదలు, క్లిష్టము లుబ్బి యార్యగన్. 82

తే. గీ. ఎందఱు జమీనుదారులు హీనులైరి, యెంద ఱగ్రహారస్థులు కుంచువొంది,
రెందఱు ధనాఢ్య లియ్యెడ నింపుచెడిరి, గాన దత్తుం గొనుట దుఃఖంపు తెరువు.

మ. కులవిధ్వంసకు లెందు, ముండల మటాకోయల్, స్వకర్మస్థితుల్
దెలియన్ జాలని మాలుబాస మిరముల్, దీపించుచున్నారు పు
త్రులు కాలస్థితిఁ బట్టి, యిట్టి వెపఁ కుందోకమ్ముతో నేమి? వీ
రలు సేవల్ పొనరింతురో? మఱి గయాశ్రాద్ధమ్ములన్ జేతురో? 84

ఉ. ఈకలికాలమందు "సుతులే పరసాధన"మంచు నెంచువా
రే కడు మూర్ఖచిత్తు, లదిగో మొకొ యెవ్వని నోటఁ జూచినన్
వాకు "మనేల? తద్దినము వైదికకర్మము లెందు?" కంచు నే
సేఁకు నెవండొ యొక్కరుఁడు చూడఁబడున్ శుచియౌ మహాత్ముఁడున్.

చ. పితరులసద్గతిన్ గుఱిచి వెంచుకొనం దగు నెవ్వరేని నేఁ
టి తులువకాలమల్ పలుప్రతీప్సుల కేడుతరమ్ము లిట్టిటుల్

గతిచెడి ఘోరమైన నరకమ్మునఁ గూలుట నిక్కువంబు, సం
తతి! ధనమ్ము నోవ్రకతి దాపరమయ్యెఁ గఁకేటి సద్గతుల్. 86

చ. అని నతఁ డిట్లు పల్కె "నెప్పుడైనను గొందఱు యోగ్యు లన్యరీ
తిని మఱికొంద ఱుంకు టది ధీరహితం బిప్రపంచ నెక్కుడై
కననగు దుష్టపద్ధతులు, కాఁదగు కార్యము కాకతీఱ ద
వ్వని వళవరా! యెుగానుఁగతి వచ్చెడి చెట్టతనమ్ము కాఁగఁగన్. 87

తే. గీ. ఇంతసందియ మేల! యే నెపుడు మనకు, లమ్మనం దెన్నియేనితరమ్ములాయెఁ
గాని నేటి కయోగ్యుఁడొక్కఁడును బుట్టి, నట్టివిన నిప్పుడిట్లేల యగునొ! చెపుమ!

చ. మనుజుఁడు మంచి కార్యమును మానఁగఁ జేసెడి పట్ల "హానివ
చ్చు" ననుచు జంకఁగూడ దొకచో నయినన్ జెడు కార్య మూని "దా
న నగును మే" లటంచును మనంబిడ రా "దిది శాస్త్రచోదితం"
బని మన మాచరింపదగు హాని యిటన్ సరకూర దింతయున్. 89

క, అని పలువిధముల బోధిం, చిన నామె యు నొప్పె నంతఁ జన్ని శిశువుఁ గై
కొని తల్లిదండ్రులై హెచ్చిన ప్రేమము మీఱఁ బెద్దఁ జేసిరి, కడఁకన్. 90

తే. గీ. ఎనిమిదవయేఁడు దాఁటకమును పె యుపన
యనము గావించి బ్రాహ్మణ జనములకును
నిత్యమును గావలసినంత నిగమభాగ
మభ్యసింపఁగఁ జేసి రయ్యాత్మజాతు. 91

తే. గీ. అగ్ని కార్యమ్ము పల్కు సంధ్యనొగి వాచ్చు, బడికిఁ జని లౌకికపువిద్యఁ బఠనసేయఁ
"బెంచుకొన్నను నిటువంటి పిల్లవాఁడు, దొరకవలె" నంచుఁ దన్ను నెల్లరు నుతింప.

క. ఆకారము నైశ్వర్యము, శ్రీ కలయును నొక్కరూపు చెందిన కరణిన్
లోకోత్తర గుణగణముల, కాకరమై పొల్చె నయ్యుదారుం డెందున్. 93

ఉ. పెద్దలయందు భక్తి మఱి పిన్నలయం దనురక్తి నేమమున్
సుద్దులయందు సక్తి వెడసోఁకగమందు విరక్తి యెంతయున్
హద్దు నతిక్రమించు కృతులందు నశక్తియుఁ గల్గి యెందునన్
ముద్దునుదారవృత్తి నొనఁవు మూలధనంబయి యొరఁ దొప్పెనన్. 94

ఉ. అంత వయస్సురచ్చుటయు నాకృతికిన్ సమమైనదాని ర
మ్యాంతయు నేని లోటు నొకయందును లేని సుశీల బంధుతా
క్రాంతఁ గులాభిజాత ననఘుమ్మగు లగ్నమునన్ వివాహమున్
సంతసమొప్పఁ జేసిరి పసందని యెల్లరుఁ జూచి మెచ్చఁగన్. 95

ఉ. నాఁటి సదస్యపుల్ దినమునన్ వెలహెచ్చగు సేలుజోడులున్
నూటపదాఱులున్ మఱియు నూతనవస్త్రములున్ వరాలు నే
పాటి కలాఢ్యుఁ డేనియును బంచె నుదారుని తండ్రి, ద్రవ్యమున్
గోటులఁ జేర్చఁగాక బుధకోటికి నీగతి నీయ వచ్చునే. 96

ఉ. ఆపయిఁ గొంత కాలమున కాసతికిన్ వయసంకురింప నా
యేపున నిశ్వరన్ గలిసి యింపులుసొంపులుఁ గుల్క దంపతుల్
గాఁపుర మాచరించుగతి గాంచి కుతూహల మంది "వీరికిన్
బాఁపలు గల్గఁగా కలయుఁ బో!" యను నెమ్మది నెంచుచుండఁగన్: 97

మ. తనకుం గాలము చేరువౌటయును నాతం డంత నాత్మీయమా
ఘనపుణ్యమ్మున నాత్మనామధరు లోకశైవ కైలాసమున్
గనఁ జేగన్ దదనంతరంబునను దత్కాలోచితంబుల్ క్రియ
మ్మనఁ గావించి యుదారుఁ డింతయును సొమ్మున్ వెచ్చఁ బెట్టెన్ వెసన్. 98

చ. పిదప నొకింత కాలము వివేకులు మెచ్చెడిసత్ప్రవర్తనం
బొదవఁగఁ "దండ్రికన్న నిత డొక్కట లోఁగఁ" డటన్న ఖ్యాతికిన్
గుదురయి తల్లిగారి కనుకూలుఁ డునై పతికిం గుతూహలా
స్పదుఁడయి బాగసాదుఁడయి సంస్కృతిఁ జక్కఁగఁ బెట్టె నొప్పుగన్. 99

సీ. అగ్రహారమునుండి యరుదెంచు రైతులఁ గని వార కష్టసుఖమ్ము లడుగు
నడిగి వారలు చెప్పు నాయాయి సంగతుల్ విని కస్తులోఁ గొంత విడిచిపెట్టుఁ
బెట్టి యింకను గనిపెట్టఁగా వలసినఁ బెట్టుఁబడికిఁ గొంత విత్తమిచ్చు
నిచ్చి యైశ్వర్య పంట వచ్చు కారున నొండొరులను బంపక తాన రూఢి నరుగు

గీ. నరిగి దాదాపు భూము లేమైన నమ్మఁ గమున కరుదేఁ దప్పక క్రియ మొనర్చు
నిమ్ము నార్జించుసకలమ్ము "నితనికన్న, బాగరాతులుంతే" రని జనులు మెచ్చ. 100

తే. గీ. ఎవ్వ రెవరికిఁ దండ్రి యేయేవిధమున, వార్షికములిచ్చెఁ దాఁ బ్రతివర్షమంబు
మఱియు నెవ్వారి నేరీతి మనుచు నితఁడు, నంతకెక్కుడుగాఁ జూచు నన్నిమొనల. 101

మ. వ్యవహారమ్మును జక్కఁబెట్టుకొను భృత్యవ్రాతముల్ క్రోచు న
భ్యవహారమ్మునరింపఁ డెన్నఁడును దేవార్చావిహీనమ్ముగా,
సవముల్ సేసెడివారి కిచ్చు మఱియున్ సత్రమ్ములం గట్టు లో
పాధుల్ దీర్చుఁ బురాణముల్ విను మదప్రాగ్భరదూరాత్ముఁడై. 102

శా. "ఐశ్వర్య మ్మధికమ్ము గల్గియును గర్వాంధత్వముల్ లేక యీ
విశ్వమ్మెల్ల నుతింప మున్ బ్రిదుఁ డావిద్యాభ్యసత్కీర్తియై
శశ్వత్కర్మ విధానతన్మై నెగడెఁ దత్సామ్య మ్మొకారుండు దా
విశ్వాసమ్మునఁ గైకొనంగలఁడు" నా వేత్తృశ్వ పఖ్యాప్తుఁడై. 103

చ. మెలఁగెడి యయ్యుదారునకు మేటిగఁ జిన్నతనమ్మునుంచి యిం
పులు గులుకంగఁ పాడునెడఁ బూరుషులైన వెలందులైన ని
క్కలిగను నాదరించు టని కేవలముల్ సహజప్రదానమై
యలవడి యంతకంత కది యంతునుబంతును లేక వర్ధిలెన్. 104

సీ. "బెంగుళూరున చుంచుభీమసానికొమార్త వీణలో నెంతేని జాణ" యనుచు
"పచిలీపురమునఁ బెమ్మసానిమనుమరా లభినయమ్మునఁ గడునధిక" యనుచు
"గద్వాలిలోన వెంకాసాని చెలియలు సాహిత్యమున మేటిచతుర" యనుచు
"బళ్ళారిలోనఁ బాపాసాని చదరంగమున జూదమున పేరు గనిన" దనుచు

గీ. "కామశాస్త్రప్రశంసయు గాత్రపుఁజవి, చెన్నపురిసానులకు వన్నె చిన్నె"లనుచు
దఱచు సాభాసరసికు లాతనిసమీపమునఁ బొగడుచుండ్రు గానంపువినికిఁ దెలిసి. 105

చ. వినివిని వాఁడు నాఁటికిని వెఱ్ఱి శిరమ్మునకెక్కె యేదియో
పనినెపమూని వాండ్రు గలపట్టణముల్ గనవాహసేయు నం
తన "వనసేల యియ్యెడకె తాఁ బిలిపించిన రారె" యంచు నె
మ్మనమున నెంచు "నట్లయిన మాత కనిష్ట" మటంచు లోఁగనున్. 106

మ. అతఁ డీరీతిని గానమందు ఘనమౌ నాసక్తి దీపింప నా
త్మ తదీయంబుగ దానికై యధికమౌ ద్రవ్యమ్ము వెచ్చించుచున్
గుతుక మ్మొప్పఁగ నభ్యసించుచును దక్కుంగల్గు కార్యమ్ములన్
మతి పోనీయక తన్మయుండగుచు నున్మత్తాత్ముఁడై వర్తిలున్. 107

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
బ్రథమాశ్వాసము.



# పాణిగృహీత.

## ద్వితీయాశ్వాసము.



ఇక్ష్వాకులదీపక
కోపాదికమార గానకోవిద సుగుణక
ప్రాపక దాతృత్వగుణ
శ్రీపూరిత నిత్యసదయ సీతారామా!

తే. గీ. అవధరింపు మనంతరం బతి సకల, కుసుమసంపత్తునకు మేలికొల్కి యగుచుఁ
బసగలుగుదంపతుల పాలిపంటయగుచు, నలమె నెల్లెడల వసంతాగమమ్ము.

శా. ఆకాలమ్మున నాతఁ డెయ్యదియొ కార్యం బుండుటం బట్టి తా
నక్కార్యమ్మును దల్లికిం దెలిపి యామె యంగీకృతిం బొంది యె
ప్డక్కాఁ బాయని ముద్దరాలిఁ దనభార్యన్ మేల్కొప్పించి తా
నొక్కండున్ జనె భాగధేయపుర మత్యుత్సాహపర్యాప్తుఁడై. 3

ఉ. ఆపురిలోన నాటకము లాడెడిశాలలు పెక్కులుంటఁ దా
నేపని కేగ నట్టిపని యెల్లను దీరినమీఁద నైనఁ బో
నోపక నాటకమ్ములను నొప్పుగఁ జూచుచు గానపుంజవుల్
బాపురె! యంచు మెచ్చుచును బాడెడివారలఁ గూడియాడుచున్. 4

మ. తనయూరిన్ దనయిల్లు వాకిలియు నాత్మద్రవ్యసంపత్తియున్
దనయిల్లాలిని దల్లినిన్ దనదుభృత్యవ్రాతముల్ జిత్తమం
దున నైనన్ దలపోయ కెల్లపుడు సంతోషప్రదం బైన గీ
తనినాదామృతవార్ధిలో మునిఁగి యీఁదన్ జొచ్చె నశ్రాంతమున్. 5

క. గానంపువినికి నెపమున, మానము మర్యాద యనుచు మతి నెంచక యా
యానీచులతో వేశ్యల, నైన గృహమ్ములకు నేగు నహరహ మతఁడున్. 6

మ. ధనవంతుండఁట! రూపవంతుఁడఁట! విద్యావంతుఁ డౌ వాఁడఁటే
ధననారీమణి వానిఁ జూచి మదిలోఁ దాత్పర్యముల్ బూనదై
నను నాతం డొకకొంతకాల మటు గానం బానుటేకాని య
క్కనకాంగీకుచకుంభసంభృతులకుం గాఁడయ్యె లోలాత్ముఁడై.

సీ. "ఇతఁ డబ్బుతో నామనుకకు నెల్లండికే చేయింప లేనె? కాంచీకలాప
మతిపురాతన మైనయట్టి నాయిలు మేడ గాఁ కుంచ నౌనె? యితండు కన్యకైన

నీ యమాయికుఁడు మాయేణాక్షి నెనసిన మఱువాఁడు గొనవచ్చు మాన్యభూమి
ధనమునకేమి యాతం డొప్పుకొన్నచో నూరక నాకూఁతు నొసఁగుదాన"

తే. గీ. నిట్లు వృద్ధవేశ్యలు తమయొడఁబలందు, "నెన్వతెన్వ్రహమ్మ నోచెనో యట్టిభాగ్య
మున" కటంచు మాటికిఁ బ్రశంసనుబొనర్ప, దిరుగు నాతఁడు మిత్రులఁ దఱచుగూడి.

ఉ. మన్నరికమ్మునన్ వరుసుమూర్తిను మోహనాంగు వేసపుం
జెన్నును గాంచి యెంతయును జిన్నెలు వన్నెలు వొల్చుభోగపుం
గన్నెలు "వీనివంటి యెసకమ్మునఁ బొల్చెడి కోడెకాండ్రు లే
రెన్నఁగ దేనికబ్బునొకొ యట్టి బోజుంగులఁ గూడు భాగ్యముల్. ౯

ఉ. పాడఁగొలమ్మునన్ బాడమి పైకమొసంగినవానికెల్లఁ దా
నూడిగముల్ బొనర్చుచు నయోమయ మైనమనమ్ము దాల్చురో
చేడెల పట్టువుల్ ఫలమెచెందఁగ నెక్కుడనో యొకండు చే
కూడు నటాళిలోఁ గొలము గొప్పసిరుల్ గలయట్టివాఁడొగిన్. 10

సీ. గానమ్మునం దింతకాంతుగల్గిన వాని కేల లేకుండెఁబో! యింతులందు
లేకేమి యేలేమలీల లాతని మదియందు నచ్చెనో యెట్టు లరయవచ్చు
ముందేమొ కాని యేపూవుఁబోఁడికిని నిప్పటికిఁ జిక్కకుండుమఁ బలుకరాదు
గానాభినయము లాకాంక్షించినంతనే వ్యభిచారి యనుట యవలనుపడదు

తే. గీ. ఇల్లలికినంతనే పండు వెట్టులగును? నావగింజయు నరభాగ మైనఁ గాదు
విందువో కందువో వీనివిధము నేఁడు, రేపటను, డాఁగునే? లంజెకాఁపురములు.

వ. అనుచుఁ బ్రసంగించుకొనుచుండురఁట. ఇది యిట్లుండ,

చ. "నిను మదిఁగోరి యుంటి నిదినిక్కము నమ్ము" మటంచు నెన్నిగౌ
తినమదికోరికల్ మృదుపదమ్ములతోడ లిఖించి యంతలో
నన తెలిపొందె "యేకాలము నాతికి నియ్యది గొప్పతప్పు దా
నన జెడఁబుట్టి రిక్కలమునంగల యంగన లిట్టిపట్టునన్" 12

ఉ. నా కితఁడే వశుండయిన నాకొలపుం గొనముల్ త్యజించి యా
పోకడలెల్లఁ బోకడచి పూవులకాళ్ళమునామ్ర తీర్చుచున్
రాఁతలు పోఁకలున్ మఱచి రాణిగఁ దద్గృహమందు యుందు నీ
బాకలి మంగళిక్ దనపు చావునకున్ మది గల్గఁజేయుచున్. 13

ఉ. ఈగతి నుల్కనట్టి తరళేక్షణయుం బది నుల్కి యాతనిన్
లోఁగొను నట్టిమార్గమును లోఁ దలపోయుని చాయగాత్రియుం
సాఁగ దటంచుఁ జింతిలనిచానయు నొక్కతెయైన లేదఁ టే
రాగము లేనివాని ననురాగముఁ గాంచరె? యొక్కపట్టునన్. 14

ఉ. అం దొకసుందరాంగి జలజాక్షి యనన్ జనువన్నెలాఁడి తా
నెందు స్వవిద్యలందుఁ గడు నెన్నికగాంచిన యెమ్మెలాఁడి వా
నిం దనవీధి నేఁగుతఱి నిక్కఁగనుంగొని లోఁగొనంగ నెం
చెం దననీచజన్మ మది శ్రేష్ఠత కాకరమై చెలంగఁగన్. 15

తే. గీ. ఎంచి తనమదిలోన యోజించి తనకుఁ, దగినమైత్రియుపాయ మొకటి జాణ
గానఁ దనకెంతయు నువకళుఁడైనయొక్క, విటునితో మంతనమునఁ దానిటులుపలికె.

ఉ. కన్నెఱికమ్ము గాకమును కామ మొకించుక లేనియప్పుడే
పిన్నతనమ్మునన్ మిగులఁ బెంకితనమ్ములరాయనమ్ము లోఁ
గొన్నవిటాగ్రగణ్యుఁడవు కోటులొసంగియు నాఋణమ్ము, నీ
వెన్నఁడు దీర్పనేర విటు లెవ్వతె నిన్ను గణించుఁ? జెప్పుమీ. 17

క. నగలా! నాణెములా! యే, వగలాఁడికి నైనఁ గాని వలపు నిలుచునే?
మగనాలికన్న హీననె?, నగరే? నను నాకొలమ్మునం గలకన్నెల్. 18

ఉ. పిన్నటనాఁటు నన్నుఁ గొని పెంచినతల్లి ఋణమ్ము దీర్చితో!
కన్నెఱికమ్మునాఁడు నొకకాసును గొంకునఁ గట్టనేర్చితో!
వన్నెలుఁ జిన్నెలున్ గలుగవచ్చునె? భాగ్యము లేర కాఁడ! ని
న్నెన్నఁ బనేమి? నాదుమనసే కనుమెత్తని దెన్నిభంగులన్. 19

ఉ. తల్లియుఁ దల్లితల్లియును దజ్జనయిత్రియు నెన్నికొంపలో
గుల్లలుచేసి గుట్టలిడికొన్నధనమ్మది యెల్ల నల్లయుం
జెల్లముగాక నీకతన పెల్లగ డొల్లఁగఁజొచ్చె నింతకున్
దల్లికిఁ గాని పోకిళులఁ దాఁ జను రోసిలి పేరు దెచ్చునే. 20

శా. "అమ్మా! ఆంకమునందు వీపును జా నాశంతయున్ నల్పఁడే
నమ్మంబోకుము రాజునైన నొరు నైనంగాని నీచేతిలో
సొమ్ముం బెట్టినవాఁడు దక్క మొగమున్ జూపెట్టకే" యంచు నే
ర్పె మ్మాటల్, చెవి నిల్లు గట్టుకొని పోరెన్, దల్లి నిస్పాపఁగన్. 21

ఉ. అయిన నదేమి నీ వనిన నావల వేలకువేలు వచ్చినన్
గాని వృథాప్రియాళు మిటఁ గన్పడినన్ మన మింద చచ్చుఁ బో
నీ కెల కొక్కరూపికయు నీ విడ నెంచ విఁకెన్ని నాళ్ళు ని
న్నాని చరింతుఁ? దల్లియును నన్న కుటుంబముఁ దిట్టిపోయుఁగన్. 22

ఉ. ఈపురిలోని మాకులమునింతులయుం దొకవిద్దెఁ గాదునూ!
రూపమునందు నేరుపున రూఢిగ నా కెఁనయైన చాన నీ
వే పరికింపు మందఱును వేలకువేలు ధనమ్ము గూర్చి రే
నే పదనైతి నీకతన, నీవును రా విఁకఁ గొన్ని నాళ్ళకున్. 23

తే. గీ. జనని నానంద మొసరింపఁ జాలనైతిఁ, గొలమువారలలోఁ బెద్దకూళ నైతి
చేలనై సరివారలఁ బోలనైతి, నేల వేయును? నీకె యిల్లాలినైతి. 24

చ. ఇతరకులమ్ములం బొడమునింతులఁ జిన్నటినాఁడ తెచ్చి పెం
చి తగిన విద్దె బుద్ధియును జెప్పియు నొండొకజాతిపుత్త్రయుం
కృతుల నఖుల్ స్వజాతి నటరించినభంగిని సానిఁ జేయ నా
సతి తమ కత్తె దె:తయును సానులకున్ దలకంపు నింపుచున్. 25

చ. అకట నొకప్పుడున్ వినని యప్పలుకుల్ చెవి సోఁకినంత న
వ్వాతకు దానుఁడైన విటవల్లభుఁ డ్లౌన గుండె జల్లనన్
గన లుదయింప నాఁచికొని తా దని యూ నని పల్కలేక లో
ననుకొనె నిట్లు "ఛీ! పడపుటంగన లిట్టిర" యోకేవియున్. 26

చ. ననుఁ గనికాని భోజన మొనర్పదు నన్వికాని యన్యమున్
విన దొకవేళనైన నను వీడి యొకింగదు గర్వ మన్న మా
టన వినరాదు దీనివ్యాసయం బిపు డెంతటిలోన మాఱె, "గో
వనితల పేర్మికల్ల" యనువార్త లసత్యము లెట్టులో? భువిన్.

చ. జనని యొనర్చు బోధముల చందము దాఁ దలకెక్క యుండునా?
తనకొలికత్తియల్ పలు ప్రతంత్రము లాత్మఁ గలంచియుండునా?

ననుఁ దలఁదాఁటు నింక నొకనాయకునిన్ వరియించి యుండుదానా!
కనికర మింతలేక యిటు కాలుచు (గ్రేలుట కేమిహేతువో. 28

చ. తనపసిపాపయందు విటు దైవముగాఁ గనునవ్వేలందియే
చనఁ జన మోటువాటి యొకచందమునన్ గనుఁ జుల్కఁజూచు లో
గినకొలఁదిన్ మతిరత పణకించమను సేవకుకన్న హీనుఁ గాఁ
గను నిది తుచ్ఛజాతులకుఁ గాక మతొక్కటఁ గల్గ నేర్చునే. 29

వ. అని యచ్చెలి నుద్దేశించి.

తే. గీ. అడిగినను తమ్మ ద్రవ్యమ్ము లడుగకున్న, రాకపోవునె? మర్యాద రాదుగాని
మగువ! "యేడ్చినదానికి మగఁడువచ్చి, యేమలాడికినదానికి రాకపోఁడు."

తే. గీ. మొదలఁ దా నెంతచేసినఁ దుదకునొక్క, మాటతో నదియెల్లను మట్టుపడును
వినవె! యీసామెతనునీవు వనజనయన! "నూఱునోములు ఱంకుతోఁ దీఱిపోవె" 31

చ. ధన మనుమాట వేశ్య కను దానికిఁ దోచన నీడవోలె నుం
డినయదియే, తగుంగతి గడింపవలెన్ సమయమ్ముమాని, యీ
నిచయపు డావు పాలిడదె? నీటి కొసంగవె? వర్ష కాలమం
దున జలదమ్ము. లింత మదిఁ దోఁచని దానికిఁ జెప్పనేటికిన్. 32

క. అన జలజాక్షియు మోమున, ననువగవు సెలంగ నోయనుంగుబోజుంగా!
విను ధన మమ్మకుటకు వెన్నెనె! యెక్కడఁదెత్తు! వది, యొతింగింపుమొగిన్. 33

వ. ఇట్టిపట్టునఁ గృష్ణునకు నొక గొల్లచేడియ చెప్పిన సమాధానమ్ము గల దా
కర్ణింపుము. 34

మ. జనన మ్మాదిగఁ బొట్టనించితివి గా! చౌర్యమ్మె కార్యమ్ము గా
ధన మెక్కింతయు నీయకే పరజసతీదాంపత్యముల్ గొన్న నీ
జననంబుల్ పదికోటు లీబుణము దీర్చన్నేర్చునే! యట్టి, నీ
కును నేమున్నది! యేమొసంగదగు! వహా! గోపాలచూడామణీ. 35

వ. అని యాజలజాక్షి యతనికిన్ గొంతబుజ్జగించి మఱియును. 36

మ. శుకకోకిల గానమున్ మినుచేతఁ గొందఱేఁ గన్నెలన్ వలపించి యా
పైని కాట్యమటంచుఁ గొందఱి బాలలన్ గికురించ్చియున్

సూనబాణకళాప్రవీణతఁ జూపి కొందఱఁ బ్రోడలన్
మానభంగ మొనర్చునీవును మా కొసంగెడి దేమిటో. 37

ఉ. కావున నిన్ను నేను ధనకాంక్షమెయిన్ జననాఁటనుండియున్
బూవిలుకాని ముచ్చటలఁ బొందఁగలే దిది నిక్కువంబు, వే
నేవిధినైన జన్మ మిది యెంతకునుండునో యంతవట్టు నీ
తో విడకుండుటే నిజము తొంబదివిఘ్నము లెందు వచ్చినన్. 38

క. మనచెలిమికి భంగ మ్మొందుచు గల్గకయుండునట్టి త్రోవను ద్రవ్యం
బును నార్జింపఁగవలె నే,మన! ద్రవ్యము లేమి నెట్టులగుఁ బోషణముల్. 39

ఆ. వె. "కూరుచుండి తినిన గుళ్లుగోపురములు, నాటు" వెన్నినాళ్ల కగును నింట
నున్నద్రవ్య మింక నొండొక్కసముపాయ, మెద్దియేనిఁ జూచుటే హితంబు. 40

క. ధన మెంత నీవొసంగిన, గొన నది యేమంటివేని? గూఢమ్ముగ వ
ర్తన గల్గుప్రియునిపై మన, మెనసినగతి నుంచుకొనిన నెనయదు వింటే. 41

ఉ. ఎంతధన మ్మొసంగినను నెన్నివగల్ మొయినిండ వైచినన్
గాంతుఁ డొకండు వేఱొకఁడు గావలె నిష్టుఁడు రోవెలంది, కీ
యింతుల మర్మకర్మము లొకింత యెఱుంగ రహో! జమీనుదా
ర్లఁతిపురమ్ములం దిడుదు రందును మానవు మాప్రవర్తనల్. 42

గీ. అభినయమటంచునో గానమనియొ వైద్య,మనియొ మఱియెద్దియోమిష యనువుపఱచి
తనకుఁ బ్రియుఁడగువాని నంతఃపురమున, కక్రమమ్మున రప్పింతు రబ్జముఖులు. 43

క. అది యేమికర్మమో తొం,బదిలక్ష లొసంగనేని మదముం డేఁచన్
గుదురదుమన మిక్కుంటిల, వద నెఱిఁగినయట్టివిటునియందుం బోలెన్. 44

మ. ఇదియే నిక్కము గాకయున్న విను విూ వీయూరనే కాదు తొం
బదియూళ్లన్ గనుఁగొమ్ము ద్రవ్యచుహితుల్ మాజాతి పూఁబోణులన్
బదిల మ్మొక్కతి నుంచుకొంటయును నప్పద్మాక్షు లింకొక్కనిన్
గదికిన్ దూతిక నంపి తెచ్చుకొనుటే గన్పట్టు నీ కెల్లెడన్. 45

ఉ. కొందఱు వెఱ్ఱు లయ్యెడలఁ గొండొకమానిసి ద్వారమందుఁ గా
పుం దగుజీత మిచ్చి యిడిపోదురు వాని కొకింత యిచ్చినన్

జెందనగఁ ధికిన్ విటునిఁ జయ్యన వాఁ డొసఁగూర్చుఁ గొన్ని చో
ట్లుం దగ వాఁడె యా విటుఁడు; లంజెలనైజము లెన్న నేటికిన్. 46

ఉ. నమ్మవుగాని నీకు నొకవార్తవమత్కృతి చెప్పెదాన మా
యిమ్మన కావలన్ గల మృగేక్షణ నాథుఁడు కట్ట నుండఁగా
నమ్మకచెల్లి! యింకొకని నచ్చుట నేరతిఁ దేల్చె నిద్ర వోఁ
దమ్మహితుండు దీపమును నా ఇది కాంతల కెంత లిప్పనుల్. 47

చ. ఒకవెలచానలేయనుచు నూహ యొనర్పకు స్త్రీలజాతికే
సుకరము మాయ యందు వెలసుందరు లిందులకై జనించుటన్
బ్రికటనకెక్కెనేనియును బాధయు నంతగ లేమిఁ జేతు రి
ట్టి కుటిల కృత్యముల్, విటు నటింపఁగఁ జేతురు కీలుబొమ్మగన్. 48

ఉ. నావుడు నాతఁ డిట్టులను నాతిరో! పిన్నటినాఁటనుండి మీ
రో వెలఁదుల్ పొనర్చు పలురోఁతలు నేను నెఱుంగువాఁడ నీ
వేవిధి బోధచేసెదవొ యేర్పడఁ జెప్పుము దివ్య మాగతం
బావల, నద్ది యెట్టిదియునైనఁ బొనర్చెద శంకఁ దక్కుచున్. 49

క. అన జలజాక్షియు మనమునఁ, దనకోరిక నెల్లనని ముదం బడుచు నే
ర్పున నిట్టులనియె దానిగ్రసం నేమిటు నద్విధాత నలిపెన్ బళిరే! 50

చ. అరసితిఁగాదె! నీ వలయుదారుని, నాతఁడు మేటిసంపదన్
ధరణిపునంతవాఁడట యుదారత నామమె చెప్పుచుండ నొం
డొరులు వచింపనేల? యతఁ డొక్కకనాఁ డొకనాతియింటి కే
గి రహిని గానమున్ వినెనీ కీలది నీవు నెఱుంగ కుందువే. 51

తే. గీ. ఇప్పటికి దేనియందు నయ్యెమ్మె కాని, మదిలగింపమి నిక్కమం బదియు నొక్క
నిముసమున నేను లోఁగొందు నీకు నాకుఁ, దగినద్రవ్యమ్ము నార్జింతు దానఁ జేసి 52

క. కావున నాతనితోఁ జన, వేవిధమున నైనఁ జేసి యియ్యెడ కతనిన్
రావింపుము తక్కనపని, నీ వేమియుఁ జేయవలదు నేన యొనగుచున్. 53

ఆ. వె. ఆతనితగలు గాంచి యామీఁద నీమీఁది, పేర్మి విడతు నంచు భీతి నీకు
లేశమైన వలదు, లేఁబ్రాయమునఁ దగు, లొక్కన్నవాని విడచు గోల గలదె.

చ. అతఁ డొకవేళ నన్నుఁ దనయంతిపురమ్మున నుండఁజేసి భృ
త్యతతులఁ గాపువెట్టినను దప్పక నాదగు నేర్పుకల్మి నీ
పతుకము నెట్టులేని సమకూర్చెద వేయును నేల? వాని "నా
ప్రీతి" యనిపించెదన్ వలపుఁ బెంచి క్రియమ్ముగ నీకు రాఁకయున్ 55

క. అనవుడు నాతఁడు తనదువ్వదన మింపుకఁ జేసికొనియు ధన మీలేమిన్
దన కది యాగతికిన్ దక్కునఁ దక్కు దటంచు నెంచి కీ లెఱింగి యొగిన్. 56

ఆ. వె. అది యశక్యమగుట నాత్మ నెఱింగియు, దానివలనఁ గలుగుతగులుల ద్రిప్ప
కానఁగలేక "వల్లె" యని యొప్పుకొనియె నే,పనికిఁ దుచ్ఛవిటులు పాలుపడరు? 57

తే. గీ. రాణి నొరుఁ గూర్చె మున్న భళ్యాణనృపతి
తనసతికిఁ దాన దూతయై చనియె నలుఁడు
పరుఁ గవయఁ బొందఁ డిడె నాజ్ఞ భార్య, కంత
కన్న ఘనుఁడెనె? యిది భార్య గాదు నాకు. 58

క. అని మనము సమాధానంబును బొందఁగఁ జేసికొని సుముఖుఁడై మెలమె
ల్లనఁ, జని యొకదినమున ని, ట్లనియె సుదారుఁ గని మైత్రియులకుకతనన్. 59

మ. తమ రీయూరికి వచ్చు కార్యమది సాంతం బాయెనే? యేఁ శే
షము లేప త్తనయందుఁ గాంచితిరి? నాస మ్మిచ్చుటన్ మీకు సౌ
ఖ్యముగా నున్నదియే? యిటన్ దమరు నింకన్ గొన్ని నాళ్లుందురే?
తమ రేగన్ మము బోఁట్రిమిత్రులకుఁ జింతల్ సెప్పఁగా శక్యమే. 60

శా. గానమ్మున్ వినుచుంటి రేఁగద! సమగ్రప్రజ్ఞ యద్దాన నే
మీనాక్షీమణి కొప్పు! నాట్యమున నేమీ? యన్యమం దేమి? యే
యేనాళీకముఖుల్ నటింపఁ దగువా రీపీట? మీవీట్రిలో
నీనాట్యాభినయాదికమ్ములను హాయిన్ జెందువా రందురే? 61

చ. అనవుడు గానమందుఁ గల రంగన లయ్యెడ నెందరేని యా
యనుకృతికైన లేదభినయమ్మున నొక్కతె మాపురమ్మునం
దున, నన నేల? దేశమది దుర్గతిభాజన మొక్కదీనికే
వినికియె కాని యయ్యెడ వివేకిని గన్పడ దందు నెందునన్. 62

కం. నెలనుండి యెండ సోఁకదటో, యెలనాఁగలఁ జూచుచుంటి నించుక గాఁకం
బలవడుటె గాని యభినయ, మొలయుచు మాదేశ మిదియు నొక్కటె తలఁపన్. 68

కం. వినియుంటిఁ బ్రసంగమువలె, మును మును నీపట్టణమున "మునుప యొకతె చ
క్కనిరీతి నభినయమ్మునఁ, బనిసేయు" నటంచు దాని వలనుఁ జూడన్. 46

తే. గీ. దాని నామమ్ము మఱచితిఁ గాని యంత, సుప్రసిద్ధుఁ జేరెల? సొగసువతుల
నదియె తగినదియఁట యింతకంత కవన, వల్లనఁటయెంత నిజమొ యీ యంశములు స.65

కం. దూరపుఁ గొండలు నునుపను, తీరో మటియేమొ "యా పతికి నభినయపుం
దేరాములు సరిరా" రని, పేర గలదు దానికచటఁ బెద్దఁ బనుడుఁ గన్. 66

కం. విని వెదకఁ బోవు తీవియు, దన కాళ్లకుఁ దగిలిన ట్లగుఁడు సంతోష
మ్మును గని, యది యొక్కతెయే, చను నీపురిలోని సానిజాతికిఁ దొడవై 67

తే. గీ. అందమునకిక్క, మరియాదలందులెక్క, యభినయపుపీఠ, నడిరయసదు రకీని
గానమునవీణ, మేల్కవనానజా, సంపదను మెట్టి, నాకే నాక సాక్షి? 63

కం. చిన్నప్పటినుండి యూన, క్కన్నియ నెఱుఁగుదును నేను, గలకలనగవుం
జెన్నగు నెమ్మోమున కొక, వన్నియిడుఁ గా వ్యవుల మధుర వచనపురచనల్.

తే. గీ. బాల్యమును మెట్టి మెరఁబట్టి బైటఁగొట్టి, యౌవనము రాధ యమ్మన ననఁగఁ జెలికి
చనలు చెంకలదూరెను గనులు చెవుల, దూరె నడుము టెకే గనో తోఁచ దహహా! 69

సీ. వనసువీఱఁగ నొక్కమాటు చూచిన గండశిలలకైనను గుండెజలజనింపఁ
జనవుమీఱఁగ నొక్కసారి ముట్టిన సుక్కకంబాలకును బులుకలు పొసంగఁ
గులుకుచు నొకసారి పలుకరించినఁ బిచ్చవానికైనను గచ్చ వదలిపోవుఁ
బదను గా నొకమాటు భావమ్ము సూచింప బమ్మకైనను బుట్టు రిమ్మ తెవులు 70

గీ. మురిపుమురిసిన ముద్దులు మూటఁగట్టుఁ, బలుకుపలికినఁ దేనెలవానగురియు
నవ్వునవ్విన నోటరత్నాలు రాలు, కలితలావణ్య పేటి యక్కామఘోటి. 71

సీ. బిబ్బోకవతి గబ్బిగుబ్బదోయినిఁ జూడ మతిమాలి బతిమాలు యతియు రతికి
నుడురాజముఖి కంటఁబడి దానిజడఁ జూచి జడదారి పెనదారిఁ జనఁగఁ దివుర
కన్నెమిన్న బెడంగుకన్న సన్నలు గన్నఁ గన్నవాఁడును దాల్మి సున్నఁ జేయుఁ
గల్కి ముద్దులు గుల్కు చిల్కపలుకుల కుల్కి పల్కరింపఁగఁ జూచుఁ గల్కియైన

గీ. నొంటిపాటునఁ జెలికడ నుండెనేని, దత్తమ్మన వేదాంతి మత్తపడును
జెలిశరీరమ్ము నొకప చేస్పృశింపఁ, బుంస్త్వ మొదవింపఁజేయు నపుంసకునకు. 12

ఉ. చామనచాయయున్ మిగులఁ జక్కని చక్కన లేడిచూపు ల
క్కామునికైననున్ వికృతి గల్పఁగఁజేసెడి సోయగమ్ము లీ
లామధురోక్తిచాతురి కలాకలనమ్ము బెడంగుఁ బ్రాయమున్
మోమున నోయారమున్ భువనమోహనమై తగు నవ్వెలందికిన్. 73

తే. గీ. పేరు జలజాక్షి యది నేతిబీఱకాయ, గాను జలజమ్ములను దెచ్చి కమలసూతి
తాపమును సేయుకల్పనిషమ్ము దోఁప, నతికె మోమున ననటొక్క యక్కజంబె. 74

గీ. అనుదారుండు వల్కు "నీ యుత్తరము లెన్నున్న నేర్పు యనియు నక్కన్నె కడకు
మనము పోవచ్చునో? కానిపురుఁ డెవఁడురా, బెట్టికొనియుండఁడో? వానికట్టు లేదా?"

చ. అన నతఁ డిట్టులల్కు "నది యాకొలమందుఁ బుట్టెఁ దగ్గ జ
న్మా యని యెంచఁ బోకుఁడు ధ్రువమ్ముగఁ బూఁగుత్తుకోఁటలోని చం
దనలతయున్ గలంజప్రవనమ్మున నాతులసీమతల్లి, దా
నినడత చందమున్ వినుతు నిక్కము మీ మన మక్కజంపడన్. 76

ఉ. కన్నె తికమ్ము కానొకఁడు గైకొనె, వాని యదృష్ట మెట్టిదో
చెన్నఁటివాడు తప్ప నలచేడియ రెక్కవొ వాఁ డెఱుంగఁడా,
చిన్నియెమూరి యాపయిని సీ! యని యెందులకో విరక్తి లోఁ
గొన్నదివోలెఁ గైకొనదు కోటులొసంగెడివాఁడు వచ్చినన్. 77

ఉ. దానికిఁ బ్రాయ మియ్యేడల దగ్గరదగ్గర నిర్వదేఁడు లే
మానిని యుండు నిట్టిక్రియ మానవలోకమునందుఁ? దన్మనం
బే నరవాఛనూనపయి నేర్పడియుండెనో? యెంతకోస మీ
మానము తాల్చెనో! యొరులమానస మేగతిఁ గాననయ్యెడిన్. 78

సీ. ప్రాగ్వరీతిగాఁ బద్యమ్ములను వ్రాసి "వ్రాయుమి?జా" బంచుఁ బంపువారు
యుత్తరమ్ము వ్రాయ కుండి యెచ్చటనైనఁ గనుపడ్డఁ "గరుణ లే" దనెడివారు
లేనిపోనిపని గల్పించుక యింటిచుట్టును బడి తిరుగాడి చనెడివారు
అంగీకరింప లే దనెడికోపముచేత గోడకుఁ గాకితాల్ గొట్టువారు

తే. గీ. ఇంటిపై బెడ్డలను వైచి యేగువారు, గొట్టనలెనందు లోలోన గొణుగువారు
నై తుదకు దానిపొందుఁ దామందలేక, విసివి వదలిరి యాజోలి వీట్రివిటులు. 79

మ. ఎవనికిన్ ధన్యనిఁ జేయనున్నదియొ? తానెవ్వాని తారుణ్యమున్
గవివర్ణ్యం బొనరింపనున్నదియొ? యేకాంతాశిరోరత్నమున్

పవిత్రాత్మై యుడికింపనున్నదియో! యేసాధ్వి సంసారసా
రవిహీనత్వము వాప నున్నదియో? నేరం బోల దూహింపఁగన్. 80

క. అనవుడుఁ "దాదృశగుణగణ, ఖనిఁ గనుఁగొనుటయును గొంత గణనీయమె నీ
వెనువెంట నెప్పుడేనియుఁ, జనుదెంచెదఁ దెల్పఁ దగిన సమయ" మ్మనుడున్. 81

క. "కనుఁగొని తెల్పెద" నని యా, జవరాచఁ డరిగె దాని చక్కఁదనము నె
మ్మనమున నాటుకతన నూ, తనమాంద్య మ్మయ్యె నాఁడవరి కరుదెంచెన్. 82

క. దానియిలు సేరిన ట్లుద్దానిన్ గనుఁగొనినయట్లు దానిచతురతన్
దా నోడినట్లు మనమున, దానింగను దాని నెంచు దానినుతించున్. 83

తే. గీ. మునుపువినినప్పుడే కొంత మొలకగనిన, వానియనురాగవృక్ష మివ్వానికతన
నిప్పుడు తిరిగియు వింటచే నెదిగి వింత, పరణి నొక్కింత శాఖోపశాఖలలమె. 84

వ. అట్టియెడ నింతకుమున్ను జలజాక్షిఁ గుఱించి ప్రశంసించినవంచకున కొక్కింత శత్రు
వగు వనితయొక్క విటుం డిట్లనె. 85

తే. గీ ఎవనితో నెవ్వఁడేనిఁ దన్నింతకంత, యెఱుఁగకున్నప్డు మంచియే యగును గాక
చెట్టయగుఁ గాక తనయంతఁ జెప్పఁ దొడఁగు, వానికన్నను బేల యెందైనఁ గలఁడె!

క. అయినను మీశ్రేయస్సు ప్రధానముగాఁ గోర మీదుతలఁ బెక్కంగా
నానేర్చినంతలో మీ, కేనొకసంగతిని జెప్ప నెంచితని జూఁడీ. 87

క. వితువర్తనలోఁ జిన్న, ప్పటినుండియుఁ దిరిగి దానఁ బడుపాటుల నొ
క్కటియును దక్కక యెఱిఁగెఁ, పటుమతి నని నన్నెఱుంగవలయును మీరల్.

క. విధవల నేకులు గల, "రా, విధవలలో మొట్టమొదటివిధవ యెవఁడు" నా
నధమపువేశ్యలఁ గూడెడి, విధవయె! నాయనుభవమున వినిచెదఁ జూడీ. 89

క. ప్రేమ మొకించుక లేకయె, కామము గలవనితవలెనె కాసునకై తా
నోమసుతునైనఁ గూడెడి, సామాన్యం గూడువానిజన్మము ఘనమే? 90

తే. గీ. ఇహపరమ్ముల నెఱుఁగని హీనమతులు, కష్టసుఖముల నెఱుఁగని కఠినమతులు
మానమర్యాద లెఱుఁగని మందమతులు, తక్కువెలవెలఁదులపొందు దలఁపరెందు.

ఉ. దండుగద్రోహమలో సకలధర్మములన్ విడనాడి బోగపున్
ముండలతోడఁ బోవుటకు బుద్ధిని బ్రేరణ చేయుచున్న యా
గండలకొడ్కు దానికి సరాసరిగా ధన మీయకున్న బ్రి
హ్మండము మ్రగ్గిపోయినటు లాపయి నేత్తురు సర్వశూన్యులై.

సన్నగిలుఁగా, ద్వితీయ నగు చందురుఁ డన్నఁ! గ్రియక్రియమ్ముగా
నున్నతిఁ జెందు భేద మిదియొక్కటి పొ్రిదకును న్నపోహకున్. 108

తే. గీ. అందులో మీర లెద్దానిఁ బొందు సేయ, నెంచుచుంటిరో యదియు మీ కీడు గాదు
దానికుపకార మొనరించుతలఁపుఁ గలిగి, వాఁడటులు సెప్పె నేనాఁటి వనిత యదియు.

తే. గీ. ఇపుడు మీతోడఁ జెప్పిన యాప్రబుద్ధుఁ, డెలమి నివ్వన్నెలాఁడికి వలపు మగఁడు
పేరుఁ గ్రొచ్చెంగ నేల? యాయూర దీనిఁ, జూడకున్నట్టివార లెవ్వొట్ట లేరు.

క. ధనవాంఛ లేక యే యువ్వనితామణి యీసు వచ్చురసికే విటులన్
గని పిల్చి కూడఁ జొచ్చెను, దన కొలమున కన్నె లెల్లఁ దను నవ్వంగన్.

ఆ. వె. "మాఱుమనువు దానిఁ జేరంగఁ దీసిన, మొదటిమగని సోదె మొనల వెట్టె"
నన్నరీతి నిది రసాభాస, మందును, నెక్కుడనుచు మీర లెఱుఁగవలయు.

క. చాతుర్మాస్యలలో యతు, లేతీరున బొంకెదరో యదే తీరున వే
శ్యాతరుణులు వయసు గడుగ, దాఁతురు; తలక్రిందు మూడఁ దగు నటు నిచటన్.

ఆ. వె. తనకుఁ బెద్దయైనతరుణితోఁ గూడుచు, యాయీ వణఁగఁ జేయు ట్టులుండ
"దాని కేటిపీనితగు! లేదకే?" డంచు, నగుదు రెల్లవారు నగడు చేసి.

తే. గీ. కడఁగి "కడవంత గుమ్మడికాయ కత్తి, పీఁటకగు లోఁదు" వనియట్టి బోటి నొప్పు
టొప్పివంబేనియును దీని నొప్పబోకుఁ, డింతకన్నను జపలురా లెందు లేదు.

క. అనఁ నతఁ డిట్లను "శీవమ్ములను గఱవే?" చెప్పవచ్చు లోఁబడియెడి య
జ్ఞానులుఁ దొరకరు వేశ్యా, జనులకుఁ గలదో నఁగు లితరజనులకు లేవే? 111

తే. గీ. దేనియందైన ననుభూతి దీఱుపిదప, దాని నిరసించువాఁడెంత జ్ఞానిగాఁడు
మొట్టమొదటన నిరసించునట్టివాని, నెన్నఁగాఁదగు వారలు నున్న జగతి.

క. అనిపలుక నాతఁ డంతటఁ, జనియె నుదారుఁ డిటులోనఁ జర్చించి "నొకం
డను మోదించినవస్తువు, జనుఁ డింకొకఁ డొప్పఁడిదియు సహజంబెందున్. 113

క. చందురుకాంతిఁ గని లో, నెందఱు సంతోషమందరే? యెయ్యెడలను దా
మందురె? పంకజములు, జగమందటికిన్ ముదమొసంగునది లేదెందున్.

ఉ. దాని పవిత్రరసన్ గుఱించి తద్దయు నాతఁడు నచ్చఁ జెప్పిన
ట్టేనరుఁడైన నయ్యతివ యేలికొనన్ గమకింప దన్నమా
శే నిజ, మక్కఁతమ్మునన యాతని కాతరణీవతంసమం
దూనె నసూయ, నిక్కముది యొక్కఁడు సెప్పెడి బుద్ధు లొప్పునే! 115

ఆ. వె. దాని వినినదాది తన్మయుంబయి చిత్తవృత్తి విస్మృతాన్యవృత్తి యయ్యెఁ
గనిన యప్పు డేమి గనున్నదో, బుద్ధి కర్మ మనుసరించుఁగాదె! యెందు. 116

సీ. కాంతలతోఁ బొందఁగారామి సిక్కుమా! యటులైన నేల పెండ్లాడవలయు ?
అన్యకాంతలఁ గూడు టనుచితం బందుమా! యటులైన నిదియుఁగా దన్యకాంత
వెలయాండ్రచెల్మి తప్పిదమౌనటందుమా! యటులైన వీండ్రెందు కవనియందు ?
సత్కులీనులకు నాచారంబు గా దందుమా! యింతలోన నేమాఁ గులమ్ము ?

తే. గీ. కలియుగమ్మున నీరీతి కట్టుఁబాటు, గాని మున్ను శకుంతల గాదె? వేశ్య
యాపెఁ గొన్న దుష్యంతున కందునిందు, నేమి లోపమ్ము గల్గె? నిందేటి శంక?

చ. పలువుర నొక్కచేడియకుఁ బొల్పదు టొప్పుగాని నేమముల్
వెలసెడి యిట్టియుగ్మలిని వీధిమొగమ్ము గనంగ నీక తాఁ
గులసతిఁబోలె నుంచుకొనఁగూడదె? దీన మతేమిలోపమా?
కలిమికి నొందుపుల్ ఫలము గాదె? మహోన్నతభోగభాగ్యముల్. 118

ఉ. భోగమునందు నిచ్చలును బొందనివారిల లేరు దానికిన్
ద్యాగము ముఖ్య, మందులకు ద్రవ్యము గావలె దానిలేమి న
య్యాగమవేత్త లీసుఖము నందఁగలేక స్వరీతి నెల్లరన్
భోగవిహీనులన్ సలుపఁ బొత్తము లీక్రియ వ్రాసి రీనునన్. 119

క. ఒకని ధనమాటచేఁ బర, వికచాంభోజాక్షి నెనయువిధ మది దోసం
బిఁక సకలజనులకును దా, నొకగతి ధనమగుట వేశ్య నొందందగదే. 120

క. ధననాశనతకు నాశన, ఘనతా నాశనము లిందుఁ గలుగుట ధ్రువమై
నను నెల్లగతుల నయ్యవి, యనుపదు ననరాదు భాగ్యవశమగుకతనన్. 121

తే. గీ. ఎందు నేనియు సందియ మెన్నకుండ, మనుజుఁడుపార్జనమ్మునొనఁగవలయు
గాని దీర్ఘయోజన కొఱగాదు "సంశ, యాత్మవశియించు" నని పెద్ద లంద్రుగాదె.

ఉ. సారవిహీనమైన భవసాగరమందుఁ గురంగలోచనల్
సారము, తెల్వితేటలును జాణతనమ్మును నందుముఖ్య మీ
తీరు స్వతంత్రలైన సుదతీమణులందుఁ బొసంగు, వాం ద్రోహ
కారిణులంచు మానుకొనఁ జాతురి యింకెటుఁ జూడఁ గల్గెడిన్. 122

ఆ. వె. దొసఁగులెన్నియేని బొసఁగుఁగాకెందును, గలుఁగ గానవిద్య కన్న లేదు
అంగనాజనమ్ములకు రూపాజీవ, కన్న మనము దనుపుకన్న నున్న.

చ. అదియునుఁ గాక వస్తుగుణ మారయ నెంచిన దేసికొందు నె
య్యది సహజంబొ దానిఁ గవనౌనటు, వేఱొకచోట నించుమిం
చు దనకు నట్టిసంగతియె చొప్పడినన్ సహజప్రచారమై
యొదవమిఁ దెచ్చిపెట్టినటు లుండకమాన దనేకభంగులన్. 124

క. ఆమనిఁ బాడదె రసాలము, తో మఱియొక ఋతువునందుఁ దొడరునదియుఁ దా
నామధురిమ మిడ నేరదు, హో! మహినది మేనమామపోలిక యగుటన్. 125

క. ఇటు పలువిధముల యోజిం, పుట కారంభించునంత మొట్టమొదటి యు
ద్భటుఁడే గుదెంచి "యటకే, కుట రే" యని చెప్పుటను రగులొల్లనకోర్కెన్. 126

తే. గీ. అందులకె సిద్ధమైయుంటి నగఁడుచల్లె, యనియె నతఁడట్టులు నాఁడు నరుగుదెంచె
నర్మసఖుతోడఁ గూడి యువాళ్ళతిమిన్న, సదనమునకేగె నభినయాసక్తి నతఁడు. 127

## గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందు
ద్వితీయాశ్వాసము.



# పాణిగృహీత.

## తృతీయాశ్వాసము.



సరసతర, రుచిరగీత,
స్వరసాదర లక్ష్మణాగ్రజన్మగృహీతా,
గురుతర భాగ్యసమేతా,
చిరకీర్తిప్రాప్తిధామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బాలతాంగి, యెప్పనును గనుమాయకరోసక మెసఁగ
తనదుదేహమ్ము గేహమ్ముఁ దదధికముగ, సొంపుగులుకనలంకృతుల్ చొనిపిపవ. 2

క. తత్తదుపాంగమ్ముల న, త్యుత్తమగతి నలవరించి యొక్కయెడఁ దదా
యత్తమ్ముగుచిత్తమ్మున, నత్తరుణి గవాక్షనిహిత మగుచూపు పొలయన్. 3

తే. గీ. ఎదురుచూచుచు నున్నంత నిరువురచటి, కేగి రేగుటయును దరుణేందువదన
దవ్వులను గాంచి కేళీసదనములోని, కంతలోఁ జనె సిగ్గున్న యబలవోలె. 4

తే. గీ. అక్క్యాకారుని నొక యుచితాసనమున, నుండఁగాఁ జేసి వర్మసఖుండు లోని
కరిగి "యిదియేమిపాప మోయబల! యతని, దీసికొనివచ్చినప్పుడే తీరు తగునె?" 5

వ. అన నాటక్కరికరిగమన యతని కిట్లను.

ఉ. దూరమునందు నున్నయెడఁ దోయజనేత్రిల కెంతయేని వా
గ్ధోరణి యప్పటిల్లు మదిఁ గొంకొకయించుకయేన్ జనింప దా
ధీరతయున్ గభీరతయుఁ దెంపును బెంపును దగ్గ్రైనక య
ప్పూరుషు మోము గన్గొనినఁ బోవునదెంతటి ప్రౌఢకేనియున్. 6

క. నమ్మెదవో లేదో యాతని, నెమ్మొగముం గనినయంత నే మదిలో నొ
క్కమ్మడిగ లజ్జవొడమెన్, జిమ్మన నది నదలిచనను చేవదగులంటన్. 7

క. పనితనమునుండి నన్నున్, గుసుమశరవిహారముఁ దగుల్ కొల్పినని
దు సమీపమ్మున నితయని, దెస మొగమెటు త్రిప్పి నిలువఁ జేయవలెఁగుసన్. 8

క. కలువుర ప్రియరాఁడొక్కటు, గలసభఁ బురుషుండు నిలువఁగలఁ డదిరసమున్
దోలఁగింపదు కామినుఁ డు, నిలుచుటకున్ దగదు రసము నీరసము నగున్. 9

వ. అను సక్కలికి పరిసంగమ్మ కడ్డుగా నతం డిట్లను.

క. అతఁడదట నే నిచట నుం, టతగదు నే నెఱుఁగనట్టి టక్కరితనమా?
యాతని! యిది, సిగ్గు మీ జాతి తరుణులకు నున్న యంత తెల్లం బెన్నన్. 10

తే. గీ. అని యఖండమగుటయు నత్యుత్తమమిన్న, యల్లనల్లన వాకుండునట్టియెడకు
నరిగి యటఁ గంబ మొక్కింత యడ్డుగాఁగ, నోరగా నిల్చి కాంచుచునుండునంత.

క. తనమది నర్ధాంగినిఁ గనుఁ, గొను టెప్పుడటంచుఁ గోర్కె గుబ్బతిలఁగఁ జిం
తనసేయు నయ్యుదారుఁడు, వనితఁ బెడంగంతఁ గాంచి వహ్వారె! యనుచున్. 12

తే. గీ. మెచ్చి "యిచ్చపలాక్షి నామేడనుంచ, నేర్చితినయేని నాదు వన్నెయును వాసి
కలుగు జన్మంబ మిది సార్థకత్వమందుఁ, గలిమిగలుగుటకును నంతకలుగు ఫలము. 13

క. తగు కాంతతోడఁ బొందుట, దగులని మనుజునకునైన ధనధాన్యమ్ముల్
సొగసును జాణతనమ్మును, భగవద్వంచితము లధికపాపాస్పదముల్. 14

ఉ. ఈతరుణీమణిన్ గలసి యించుక భేదము లేక యుండఁ దా
నేతరుణుండు కామకల లెప్పుడు చింతనసేయుచున్ లస
ద్గీతవినోదముల్ గనుచుఁ గేళి మోదమయాత్ముఁడై వసు
స్స్థితికి సార్థకత్వ మొదవించునొ వాఁడుగదా! కృతార్థుఁడౌ." 15

క. అని యూహసేయు దానిన్, బనరాలోకన మొనర్చి మరియు మతియు న
వ్వనిత కిలపాటి లేదని తనలో, నానందమందుఁ దనియఁగ నెడందన్. 16

తే. గీ. అట్టియెడ నర్మసఖుఁడిట్టు లను "జగాన, నభినయమ్మున నీపాటి యుండకత్తె
గానఁగారాదు గానమ్ముఁ గవనశక్తి, దానికిన్ దోడు దీని కేతరుణి లేదు?

క. ఎదుటన్ జెప్పిన నతియుని, మది నమ్మదవతికిఁ దోఁచు మాటలిఁకేలా?
గుదిగూర్చె నన్నిసంగతు, లిది తావుగ నెంచి ధాత యింపెసలారన్. 18

క. అని జలజాక్షిం గనుఁగొని "వనబోణిరో! సిగ్గు వారనాతికిఁ దగునే?
కనుఁగొన వచ్చినవారల, మనమెక్కన్ మెలఁగకుఁట మరియాదటవే? 19

క. సిగ్గుగల వారకాంతయు సి, గ్గెడలు కులాంగనయును. జెనుదురు నీవీ
యొగ్గులుఁగ నేరవిది యొక, పెగ్గ యనుచు గునిసె దింపుఁ బెంపుగలుగునే. 20

తే. "సగముచచ్చి యంతయుఁజచ్చి జగతిగాన, హాస్యములు నేర్చికొనవలె" నందు రందు
నభినయమ్మునట్టిద యదియుఁగల్గి, యంతసిగ్గునడఁజనునె? యోయి గురుబోణి. 21

క. నీ తెలివితేటలను సం, గీతాభినయప్రసక్తికిన్ గైతకుఁ బ్రఖ్యాతిఁ జెడఁగొట్టెఁగద! లో,కాతీతంబైన లజ్జ యలవడి యబలా. 22

క. అనుమాటకుఁ బ్రత్యుత్తర, మును జెప్పక యంతకన్న మొగ మించుక వం
చి నగుచు నా జలజాక్షి య, భినయపుఁ బాండిత్యమెల్ల వెల్లడి చేసెన్. 23

తే. గీ. తెచ్చి పెట్టిన సిగ్గయ్యు ధీర యగుట, సహజవైఖరిఁ గనఁజేసి చలదపాంగ
వీక్షణమ్ముల నొక్కింత వెల్లిగొలుప, నిందుముఖ కెక్కె నయ్యుదారుండు పలుకు. 24

తే. గీ. ఏటికిద్దాఁచి నీవలయించె? దింక, నీవు చెప్పిన దంతయు నిక్కమయ్యె
"వఱలు లంజెలలోఁ బతివ్రత కులాంగ, నాజనమ్ముల లంజెయు" నాఁగవినమె. 25

తే. గీ. నీవు చెప్పినయట్లన యీ వెలంది, యేదియో కారణమ్మున నిక్కొలమునఁ
బొడమెఁ గాఁబోలు వయసునఁ బ్రోఁడయయ్యు, నింతబిడియమిక్కలయున నెందుఁగలదె.

తే. గీ. అభినయమ్మది చూచినయట్టులయ్యె, గాన మీరీతి చక్కని కాంతి గలుగు
పలుకరుస గలకలుకుల కొలయు టరుదె! కవన మీరెంటికన్నను గష్టమగునె? 27

క. అను నాతనిపలుకులు విని, తనపై నవ్వానియనయు తగులుట నిక్కం
బని యెంచి యంతలోఁ దీఱని చింత వహించి యిటు కరమునూహించున్. 28

ఉ. చక్కనివాఁడు మేటి సరస మ్మగువర్తన మొప్పువాఁడు బల్
టక్కరి గానముఖ్యకలలన్ గడునేర్పరి ద్రవ్యవంతుఁ డ
మ్మక్క! యితండు నాకుఁ బ్రియుఁడౌట పురాకృతపుణ్య, మైనన్
జిక్కిన పూర్వపుఁబ్రియుని స్నేహము నేగతి మాననేర్చెదన్. 29

క. ఇతనిన్ గాంచిన దాదిగ, మతి నీరై యంతు లేనివురులున కొరయై
నత మైనచింతఁబడి వి, స్మృతసకలం బయ్యె ముందు మేఁగుట యెట్లో. 30

చ. ఇతని వరించి యెల్లపు డహీనసుఖమ్ముల నందుచున్ రమో
న్నతి కధికార మూనినయనమ్మునఁ దన్ దలపెట్టనేని నన్
మతిఁదలపోసియున్ విసివి మాటికి దూటియుఁ ద్రోవగాన క
చ్చతురఁకు కామమున్ విడి యశ మ్మెటువంటిది నాకుఁ గూర్చునో. 31

మ. ఎప్పుడో యే మగనో యటంచు మదిలో నెంచంగ నేలా! యితం
డిప్పుడే తా మొగ మింత చేసికొని యేదేఁ బెద్దయాపత్తు నె
త్తిపయిన్ వ్రాలినయట్లు చింతగొనుచున్ ధీరత్వముం బూనుటన్
గపటానందము పైకిఁ జొప్పడఁగతిన్ గన్పట్టుచున్నాఁడహో. 32

సీ. ఏకర్మమెఱుఁగని యిలఁబ్రాయమున నేను కసరికొట్ట నొకింతవిసువఁడయ్యె
నెత్తిఁగిరియు నెఱుఁగని చిఱుతగుబ్బలనాఁటి పరుసదనానకు వెఱువఁడయ్యె
నెట్టకేలకు నాదుగుట్టు కైకొని వృద్ధ యాడిపోసినదాని కలుగఁడయ్యె
నాకారణమునఁ దనకుటుంబమునఁ గల్గుకలహమ్ములకు భీతి గాంచఁడయ్యె

గీ. నన్నిటికినోర్చి నమ్మఁబ్రియురాలొ లేక. దైవమో యనుబుద్ధి నెవండలంచు
చున్నవాని వృథా దర్శ్యవున్న కారణమున విడనాడు నాకు జన్మమునుగలదె

గీ. దౌర్త్యమంగీకరించె నాతనిఁగరంచె, నంతఁబో కిమ్యేషకుఁడె వచ్చెఁ జింతగలిగి
యును మమపకారమునకు దానినెడఁజేసి, యీమదిగమ్రింగ నింతవిశ్వాసిగలఁడె!

చ. ఇటుపయి నీతనిన్ మఱవకే యొకభంగిని గారవించి య
క్కృటికము చూపి నేను గలకాలము సౌఖ్యము నందఁజేసినన్
గటకట! తానెవన్ మఱమఁగాక యిదెల్లను గామియాట, నా
కెటు మఱవంగవచ్చు నిది యెన్నిభవమ్ములకైనఁ జాలదే. 35

చ. "తనప్రియుఁ డైవవాఁడఁ టొకతప్పును నాతనియందు లేదఁ టే
పనియు నొనర్చువాఁడఁటు! సెబాసు! ధనమ్మున కాస చెంది య
య్యనఘుని నీచకృత్యమున కాస్పదుఁ గా నొనరించె నొక్క రో
వనిత" యటన్న దుర్యశము వాయుఁగ నాకు నుపాయ మున్నదే. 36

తే. గీ "పెండిలివి నాడకుండిన నుండెఁ గాని, వారకామినినైనను వరు నొకానొ
కని వరించి తదనుగతి గా మెలంగవలయు" ననుకట్టుఁబాటుండవలదె! జగతి.

ఉ. మాలెతకన్న హీన లగుమానవతుల్ వ్యభిచారవృత్తికిన్
జాలక కట్టుఁబాటునకు జంకుచు నొక్కొకనిన్ వరించుచున్
గాలముపుచ్చుచుండ, గణికాజనమంతకు నెంతహీనమో
కూళతనమ్మునన్ బహుమకొంటకు రోయ దొకించుకేనియున్. 38

తే గీ. ఒకఁడు వోయినమీఁద వేఱొకనిఁ గట్టి, కొంటమాచార మొకకొన్నికొలములం
దు వందులోనను జేర దీయధర్మములము, ధాత వంచించె నీజాతి తలియఁబోండ్ల.

క అనితవమనమునఁ జింతిలు, వనితామణి సారెసారె, వార లిరువురున్
దనతన కనుగుణ మగు రీ, తిని జింతం గాంతు రదియుఁ దెలుపన్ వశమే! 40

గీ. మగువ నీగతి నొండొరు లెఱుఁగకున్న, నెడతెఁగని చింతయును సంద్రి మీఁదుచుండెఁ
దరణి యంతటి వారికిఁ దగణియగుట, హో! యనఁగఁ బశ్చిమాంబుధి డాయఁజనియె.

క. అంత నుదారుం డచ్చెలి, చెంత న్నిలుపోపలేక చేతోజాత
శ్రాంతికి వశుఁడై చనియెడి, చింతన్ లేమటయు నతని చెలి కాఁ డనియెన్. 42

ఉ. గానము వింటివో కరసకాశలముల్ దిలకించి నారమో
హానమునందుఁ గల్గు నసమానపుఁ జాతురి దక్కఁ బంకజా
తానన యించుకే నభినయంపుఁ బ్రసక్తియుఁ జూపదయ్యె మీ
రీ నలినాక్షిపై నలిగి యిక్కరణిన్ జనుచెట్టు లొప్పగున్. 43

ఉ. వావుడు నాతఁ డిట్టులను "నాదుమనమ్మునఁ గోప మంచు నీ
వేరగ నిశ్చయించి? తని యెక్కడి చాతురి? యింతమాత్రినే
యావగలాఁడి నమ్మనె? సఖా! యొకవిద్దియుఁ గాదు దీని కే
తోత్రివల నేలతాంగి నవతుం గనఁజాలు! సెభాసు! వహ్వారే! 44

క. కనుఁగొనినమాత్రినే మన, మున మోదం బుప్పతిల్లె మున్మాటికి ని
క్కఁగాంగి కింక శ్రీమమి, చ్చిన దానంజేసి మనమఁ జేటుగుఁజూమ్మీ. 45

చ. ఇదిమొద లిత్తలోదరికి నెవ్వరియొద్దను విద్దె చూపునీ
చదశఁ దొలంగఁజేయ మనచాపుఁదు యత్న మొనర్చుఁగాక యి
చ్చ్మసవతి సిగ్గునం దిటులు మ్రిగ్గుచునుంటిఖ చూచి యాత్మసం
పద నెఱడింపఁ జేయుచెలిపట్టున నాతఁ డనుగ్రిహింపఁడే. 46

తే. గీ. మరలరావచ్చుఁగనవచ్చుఁద్వరయదేల?, యబలయేమగు? మనమేడకరుగువార?
మభినయంబెందుఁబోచ్చు? నెందడఁగుగాన?, మకట! యారంభశూరతజగతి నెంచు.

క. వావుడు నర్మసఖుం డ, ప్పొపుంబోఁడిఁగని పల్కెఁ "బోలఁతిరో? నీపైఁ
గావలసినంతకోరిక, చే వచ్చినవారి నిట్లు సేయుం దగునే? 48

క. సుమగాత్రి! వారి మంచితనమున న్నీలోటు దాఁగనం బడదయ్యెన్
దమలపుటాకులకున్ నో, చమె? యెఱుఁగవె? యిదియు సాంచంద మ్మగునే?

మ. అన నచ్చేడియు భూషణధ్వనుల పా ల్పవ్వారిగా నల్లఁ గ్రి
క్కనఁ గేళీభవనమ్ము చెంతఁ జని యాకుల్ వ్రేకలున్ దక్కఁ గ

ల్గిన మేల్వస్తువులుగూర్చి పళ్లెరమునఁ గీల్కొల్పి యొయ్యారమె
ల్లను రూపై చనుదెంచెనో! యనఁగ మెల్లన వచ్చి యచ్చేరువన్. 50

గీ. వినయభయసంభ్రమమ్ములు వెల్లిగొనఁగ, నిలువఁబడునంత నద్దానినీటొకింత
యడ్డులేమిని గనలార నతఁడు గాంచి, నిలువునీరయి యట్లన నిలుచఁబడియె. 51

తే. గీ. అంతనచ్చెలి మిన్నక రాగ్రికేలి, తమ్ములకు నాగవల్లీదళమ్ము లతని
హస్తమునసంచి పళ్లెర మచట డించి, చని యథాస్థానమున నిల్చెఁ జవులుగులుక.

ఉ. అంత నుదాయుఁ డొక్కగతి నచ్చొటువీడి తదేకచిత్తుఁడై
యింతివిలాసముల్ మకురయిమ్ములు వైదలిమేల్ హొరంగులున్
గాంతయొయారముల్ కనులఁగట్టినయ ట్లెదుటన్ స్ఫురింప న
క్కాంతుఁడు లేనిమేళ్ మటుఁ గల్పనసేయఁగఁ జూచుచున్ జనెన్. 53

ఆ. వె. చనుమ నర్మసఖునిగని యిట్లుపల్కు "నో, చెలిమికాఁడ! జగతిఁ గలుగుపట్టి
ణముల మాపురమ్మునంగల చోద్యముల్, గానరావు వేరొకంట నెందు. 54

చ. అటుఁ గులకామినుల్ పదపుటంగనలున్ మతివేనవేలు మి
క్కుటముగురూపమున్ హొయలు కొల్లలుగాఁ గలవారలుండ్రి నా
కెట నిటువంటిచానఁ గను టెన్నఁడునున్ లభియింపదయ్యె ని
చ్చటఁ భవదీయసంగతివశమ్మున నింతటి భాగ్య మబ్బెఁగా! 55

క. నాతోడ నీవు చెప్పిన, యాతరుణీమణియె యిదిసఖా? యది గాదో?
యీతీరెక్కడ? నీవను, నాతీరెక్కడ? శతాంశ మంతరమునుమీ. 56

ఉ. చూడక మాచు నేర్పు వినుచున్ వినరుండెడికౌశలమ్ము మా
టాడక యాడుజాణతన మన్నిటికేమి? యొకింత లోనఁ బో
రాడుట కమ్మనోభవు విటాళిపయిన్ బురికొల్పుపొల్పు పూఁ
బోఁడికి దేనికిన్ గలుగఁబోలను దీనికిఁ గల్గుచాడ్పునన్. 57

తే. గీ. గుబ్బలబెడంగు పిఱుఁదులగొప్పతనము, మేనితళతళలును మోముమిసమిసలును
గలికిమైనంతమాత్రిన గల్గు నిక్క, తమున మెచ్చితి నంచెద్దఁ దలఁతువేమొ.

చ. పలుకులువేయునేల? పరభామ లనన్ గను తెత్తిమాడ నే
పెలవెలఁదుల్ సుఖమ్ముగను వీనులుచల్లఁగ నెంతపాడినన్,

గలఁగదు మానసం; బిచట గానమటుండ మఱొండటుండఁ బ
ల్కులను విసంగతే దకటా! కోరికలీరిక లెత్తనేటికిన్!

చ. తరము లనెన్ని రాజరికిఁ దాతల తాతలు వారితాతలున్
మఱియును వారితాతలును మాకొలమం దిటువంటి కోర్కులన్
మరగరు, దానికేమి, కడు మన్ననకెక్కిన పాండుతీపురం
ధరు లటువంటివారి కిఁక నాకతనన్ త్రిదివస్థితుల్ చెడెన్. 60

తే. గీ. ఏమయినఁ దప్పదింక నీయింతిచెలిమి, యయ్యదియు నీయధీనమై యలరుకతన
నచిరకాలలభ్యంబని యాత్మఁ దెంతు, ననుచు నతఁడిట్టులను నుపాయనికిఁ జేర్చె. 61

ఉ. చెప్పితిఁగాదె! మురన్రసికశేఖర! యాలలితాంగి చంద, మ
య్యొప్పును గొంత మీ కనుభవోచిత మయ్యెఁగదా! తదంత న
య్యొప్పులకుప్ప యొప్పికొను టొక్కటిదక్క నుపాయమిందునన్
జొప్పడ దన్య, మేమయిన సుందరి డెందము చూచిచెప్పెదన్. 62

చ. ధనమన లెక్కలేదొకట దానికి లోఁగిన వేలసంఖ్యకే
చ్చనె, నదియేనిఁ దజ్జనని మాపునకున్ భ్రమగొల్పనేమి? య
వ్వనజముఖీలలామమును వంచనసేయఁగ నేయుపాయమున్
బనుపడ దైన యత్నమును మానఁగరా దెపుడెట్టు లుండునో! 63

చ. నినుఁ గనుఁగొన్నమాత్రమున నే వెలచేడెల లెక్కయేల? యే
వనజముఖీలలామములు వాంఛ యొనర్పక మాననేరు! రై
నను నిటు యత్నమేల యన? నాయనుభూతిఁ బట్టి చూడ ని
క్కనకనిభాంగి యోగిగఁ గాలముప్రచ్చెదునంచుఁ దోఁచెడిన్. 64

ఉ. కాని సమంజసమ్మనుచుఁ గన్పడ దిప్పటి యూహయున్ సదా
గానమునందురక్తి వెలఁగల్గు నలంకృతులందు సక్తియున్
మానశరప్రచారములఁ జొప్పడుకబ్బములన్ బ్రసక్తి య
చ్చానకు మెండు, తద్విధము చంచలతం గనఁజేయు నియ్యెడన్. 65

గీ. మునిఁగిపోయినదేమి? యమ్ముకుదతల్లి, తోడ మీమది నున్న సంతోస మెఱుఁగఁ
జేసి యామీఁద దానికిఁ జెప్పఁజేసి, యేనునుం జెప్పిచూతు నిందేటిచింత! 66

శా. నావుడు మత్తకాశిని యొకనాఁడు సుహాసిని పల్కె “నెప్పుడో
నీ విటు సేతు” వన్న నెటు నే నిలుపోపుదు! నేఁటిరేయి నా
కావగలాఁడి, యాయతివ, యాచెలి, యాచిగురాకుఁబోఁడి, యా
కావరపుం జవంగవ బోనాటుపుటిక్కన్, వశమ్ము గావలెన్. 67

క. రేపేమో మనమేమో, యాపూవు బోణియేమొ యన్యమదేమో
వే పా మిప్పుడ నాసంతాప మ్మెడఁబాపు మింకఁ దడయకు మిచటన్. 68

తే. గీ. చందురుం డభ్యుదయించెఁ జదల వెన్నె
లయును బర్వఁగఁజొచ్చెఁ దొలంగెఁ దమము
మందమారుత మదె చూడు కుందకుల ప
రిమళమ్మును వెదజల్లెఁ రేఁగె మరుఁడు. 69

ఉ. తల్లికి నేమిచెప్పెదవొ? దానికి నేమని విన్నవించెదో?
పల్లవపాణి కేక్రియఁ గృపన్ గలిగించెదొ? నన్నుఁ దమ్మనో
వల్లభుఁ జేయు భారమది పైపడి కొ మ్మిటు నీ వొనర్చినన్
జెల్లు నటుం జెలుంగు మొకచేడియ వానిఁగ నన్ దలంపుమా. 70

చ. కలదు ధన మ్మనంతముగఁ గంటికి మింటికి నంటుమాడుగుల్
గలవు సమస్తముం గలదుగాని యొకించుక లేనివారిలో
పల నొకరుండ నియ్యబలఁ బాణిగృహీతగఁ జేయనేనిఁ, గో
ర్కుల కెనగాని సంపదలు కుంకుమలేని కులాంగనామణుల్. 71

ఉ. ఏ నని తా నటంచు నొకయించుక భేదము లేకయుంట న
చ్చానకుఁ జెప్పగాఁ దగినసంగతు లేమని బోధసేతు నీ
కే నెఱిఁగింపఁగావలయునే? యదిగాక, పురాకృతంపుఁబు
ణ్యాఁగదా! లభించితివి నాకొకదూతగ నీవు నెచ్చెలీ. 72

చ. అన “నిదె పోయి వత్తు” నని యాశఁడు వెన్కకు నేగె, మీఁద మె
ల్లన బసకేగి మిక్కిలి యలందురు నెమ్మదితోడ భోజనం
బొనరిచి మిత్రురాఁకకయి యొక్కెడ నొక్కఁడు గూరుమండి తాఁ
గనఁగొనుచున్ ద్రుటిన్ యుగముగా గణియించుచు మారు దూఱుచున్. 73

ఉ. చెప్పఁగ రానివేదనలచే నలచేడియ నాత్మ నెంచి “నీ
గొప్పపిఱుందులున్ వలపుగొల్పెడి మేల్పలుచాలు లక్ష్యమున్

దప్పని చూపుఁ గోపులును దామరతంపర లైనలీలలన్
మప్పిరిఁ గొన్న మోహమున నుంచెఁగదే? జగదేకసుందరీ. 74

ఉ. చందురుబాధకే నయిపఁ జాలుదునో, మదనాగ్ని కాఁకకే
కందకయుందునో, ప్రియకాలునిఁజో దలచల్లగాలికే
వందురకుందునో సకలవాంఛలకున్ గుసుమైనమన్మథ
శ్చందనవల్లి! నీదయిన సంస్మరణాశయె మానుకొందునో! 75

మ. అకటా! నే నెటుతాళువాఁడ, నట నీవాకంబవుం బాటునన్
వికచాబ్జమ్ము లిరుంగెలంకులను నావిర్భావమున్ జెంద మి
న్నక వీక్షించుచు లజ్జ కొజ్జ యయి యానందింపఁగాఁ జేయు నా
ప్రకృతిన్ లోనఁ దలంచినంత మది నీరంబౌఁ గురంగేక్షణా. 76

క. అని తన్మయమగు మనమున, ఘనతర మగు రాగమెదిగి కాలూన నతం
డనిమేషత్వముఁ గైకొని, యును సురతావాప్తికొఱకు నూహించు నహో. 77

తే. గీ. అట్టు లొకకొంతసేపు మి న్నరసి యచట
కలికి గోరులసొంపు న చ్చెలియు మోము
వెంపు నొకకొంత గని యంతఁ బెదవిఁ గఱచి
నర్మసఖు నాత్మ నెంచి తన్నాయకుండు. 78

మ. "ఇదిగో! వచ్చెద" నంచు నేగి చనఁదేఁ డేణాక్షి యేరీతి మ
న్మదమున్ గాంచెనొ? యెట్టియుత్తరము నన్నుంగూర్చి తానంపెనో!
యదనున్ వమ్మొనరింప నెంచదుకదా? హా! దైవమా! యిట్టి క
ష్టదశాపాకము మిత్రుఁ డొప్పికొను నే? చాతుర్యమున్ జూపఁడే! 79

ఉ. ఎక్కడిమిత్రుఁ! డే నచటి కేతని నంపుట గొప్పతప్పు "తా
నక్కువఁ గాంగి కేతఁడు ప్రియంపనువాఁ" డని వింటిగాదె? సీ!
మక్కువ యెంతచేసె? ననుమాన మొకించుకయేనిఁ గాంచ కా
డిక్కున కట్టివాని వెనుదీయక పంపితి నెంత వెఱ్ఱినో? 80

తే. గీ. "తెలివితేటలుఁగలవాఁడు ధీయుఁ డితఁడు, చనిన చోఁ గార్యసిద్ధి యౌ" నని తలంపఁ
గూలిపాలి సామెతయునగూడ దాని, నొగి నథమనాయకుఁ జేయుచుండె నేమొ!

ఉ. “కంటెన కాఁడొకింత కొనగోటను నైనను మీటి కెందు వా
ల్గంటిని నాయకున్ గలుపఁగా గమకింపఁ”డటంచు మున్ను నే
వింటిని వేయుసార్లు, విధి, వీఁ డిఁక వచ్చెలిమిన్న తోడ నా
యంటుము సొంటుమం దెలుప నాడుచుఁ బాడుచుఁ గూకుచుండెఁ బో! 82

గీ. తనరుచి త్తమ్మ నేనియుఁ దగినసొగసు, గలుగు చెలిమిన్న కడకంప గదలి రాదు
అట్టిచోఁ గేవలాన్యుల నంపనగునె? దౌత్యమునకన్న సతిపొందు తప్పిదంబె? 83

క. పురుషుఁడు పురుషునినంపుట. తరుణి తరుణినంపుటయును దగ దొండొరు లొం
డొరుల ననుపఁదగు దౌత్యము, విరచించెనిపట్లఁ గనువివేకము మెఱయన్ 83

మ. అని మిత్రుం గడు దూఱుచున్ మనమునం జాలోచనల్ సేయుచున్
వనికన్ లోఁదలపోసి యుల్కిపడుచున్ వైరాగ్యముం గాంచుచున్
దనకై తానటు కేగ నూహగొనుచున్ దర్కించుచున్ దాపమున్
గనుచున్ గుందుచు నంతనంత హితుఁడున్ గన్పట్టె దౌవర్ప్యులన్. 85

క. కని “యతఁడగునో కాఁడో”, యనియును “కార్యమ్ము సఫలమయ్యెనొ లేదో”
యనియును “నిష్కారణ మివ్యనఘాత్ముని దూఱితినాఁడ” నని యును వగచున్. 86

తే. గీ. అంత దగ్గఱ కేతెంచి “యనఘ! నీవు, పనుపున్ జని యా శతపత్రనేత్రిఁ
గాంచి మెలమెల్ల నీప్రసంగము నడిచి, తెలిసికొంటిని మదినున్న తెఱఁగు కొంత. 87

క. అంగీకృతి నూహింపద, నంగీకృతి తెలుప దెందు నతివలు లేరే?
రంగైన మిమ్మువంటి భు, జంగుఁబిలు పంది యిట్టివందము కలదే? 88

చ. అయినను నాలతాంగి వ్యాపయం బొకకొంత భవత్సమాగమ
ప్రియమని కొన్ని చెయ్వుల నెఱింగితి నంతఁ దనంత నెమ్మిఁ ద
ద్దయుఁ గతినాత్మ యుత్యతివతల్లి యును నయ్యెడ కేగుదెంచె నా
శయ మొకకొంత దెల్ప నది సమ్మతి గన్పడఁ జేసి యిట్లనెన్. 89

ఉ. ఏమొదనైన “నియ్యతివ యెవ్వరిసాని?” యటన్నచో “ఫలా
నా” యని చెప్పికోఁదగిన నాయకుఁ డబ్బిన మాకుఁ గీర్తియౌ
“నీయనసాని యెవ్వతయొ యెట్టిదియో?” యని నప్పుడో “ఫలా
నా” యని చెప్పికోఁదగిన నాయిక గల్గిన మీకుఁ గీర్తియౌ. 90

తే. గీ. ఎట్టులేనియు మర్యాదయే ప్రధాన, మనుచు వర్తింతు నేకాని ధనము దెంత
వచ్చినను వేఱురీతుల కిచ్చ సేయ, నెఱుఁగరే? మీరు నావనోవృత్తి రీతి. 91

చ. ధనికుఁడు రూపశాలి గుణధన్యుఁడునౌ వదాన్యుఁడౌ
జనవరు సొప్పువాఁడు నెటుచేకుఱుఁ? దాదృశుఁ డిట్టికేలనౌ
దనకు లభించె మీకృపకతమ్మన, నియ్యెడఁ దక్కఁజెల్లునే!
యనువగువాని మానఁదగునా? మనకిల్లపు డిట్టిఁ డబ్బునే? 92

ఉ. కావున మీరుచెప్పరసికప్రియునౌ గని శంకఁదక్కి నే
నీవిధిఁ జెప్పినట్లు వచియింపుఁడు "నాదుతనూజపైఁ గడుౝ
భావము మీకుఁ గల్గు టది భాగ్యము కాని సదా కళత్రసం
భావన దీనిఁజూడఁదగుఁ బ్రాయము శాశ్వత మౌనె? యోరికౌ. 93

క. విసువవలసివచ్చిన లో, గడ నిచ్చిన దట్టులుండఁగా దానికి ము
మ్మడుగధికమిచ్చుటను ని, ష్ఠాడ పత్రము వ్రాసికొనుఁడు పూవుంబోఁడిౝ. 94

క. "మోమోటమించుకయు లే, కీముసలిని యిట్లులనియెనే?" యనకుఁ డహో!
కాముకు లెక్కడ? సత్యము, లేమాడ్కిని?" నాకుఁ గ్రొత్తలే! యివియెల్లౝ. 95

తే. గీ. మొదల నేర్పాటొకం డిట్టులాదవె నేని, మేమె మీరయి మీరలే మేమునగుచు
నుండఁగావచ్చుఁ గూడనే?! తాడిపట్ల, మఱి యుఖ్యవహారపుం టు మాటయఱు వ 96

గీ. అడఁదటింబోలెఁ బలువుర నాశ్రయించి, యొకరికనుఁ బ్రాము యొకరితో వికవికలకుఁ
బోవుటలు వాగ్ఘ్రహమ్మునపూవుఁబోఁడ్లు, నేర రిదిమీకుఁ బదపడి నిక్కమగును. 97

చ. వలపు గలన్ని వాట్లు మగువా! చెలియా! సకియా! తలోదరీ!
చిలుకలకొల్కి! యంచుఁ గడఁజేరికచేసి సమస్తవస్తువుల్
పలుమఱు తెచ్చియిచ్చి యటుపై నది కొంచొక తగ్గనేని య
క్కలికి మొగమ్ముమాడ రిది కాముకధర్మము నేనెఱుంగుదుౝ. 98

చ. కలసినకొన్ని నాళ్లొకటిగాఁ గనుపట్టెడి మేను లై దినం
బులు చనుమీఁద రెండునయి పోవఁగఁ బోవ మగండు వాలు నై
వలపు కరమ్ముగా నడుగుపట్టున సానియవస్థ చూడఁగా
వలయు మఱొక్కఁ డట్టియెడ వచ్చునొ? యిచ్చునొ? కామితార్థముల్. 99

చ. వదలినఁ జచ్చిపోము మనవైఖరి యిప్పరయుంను నెందుఁ దా
మొదలఁ గనంబడుౝ బిదప మోహముతగ్గియు జ్ఞానమబ్బియో
మదనతికన్నఁ బూరుషు మానస మొండొక చుల్కఁబొాఱు న
య్యది గనిపెట్టలేని వెయ్యాండ్రను నేగతి ముప్పునెగ్గడిన్?

చ. తగినపీటుండు చేకుఱఁడు తాత్పరమైన ధనమ్ము నీఁడు సో
యగమును నీగియుక్కగలుగు నట్టిఁడయేని యతండు నిర్ధనుం
డగు మన మిచ్చువారు కఱవా! ధనమిచ్చెడి వారెకాని, యే
మగువకు నేని సౌఖ్య మనుమానము మాగణికాపులమ్మనన్. 191

గీ. "పానలనుజేయుటుడిగి లోకానుగతిని, బోడిలియొనర్చుకొనరాదె! వెలవెలందు"
లంచుఁ గొందఱుబోధింతు రదియునంత, మంచిత్రోవయటంచు నామదికిరాదు. 102

శా. త్రాగుంబోతులు జూదగాండ్రు వనితాగ్ధపాప్రియుల్ సోమరుల్
బోగంపుంగొలముందుఁ బుట్టుపురుషుల్, పూఁబోఁడ్లు విద్యావతుల్
యోగోద్రేకిను లుత్కళార్హ లెటు లీయోషామణుల్ నీచులన్
భోగింపం దగువార లిట్టులయినన్ బోకున్నె! మర్యాదయున్. 103

ఉ. సానిగఁ జేసెనేనియును శాస్త్రులుఁ బంతులు మంత్రులున్ ధరే
శానులు వైశ్యరత్నములు సంపదగల్గెడి యెల్లవారు సం
స్థానము గాచు సేవకులచందమునం దనయిల్లు గాతు రిం
కేఁలినాక్షికిం గలవె! యిట్టిమహోన్నత భోగభాగ్యముల్. 104

సీ. "ఏకలెక్టరుకు లేదింతని" రక్కనుభంగి ను త్తరమ్ములును బ్రత్యుత్తరములు
"ఏడాక్టరుకును లేదింత యల్లడి" యన్న చందాన నిలుగాచు సారటులును
"ఏజనానాకు లే దీచంద" మనుభంగి నూడిగం బొనరించుచేడియలును
"ఏదేవతకును లే వీకానుక" లనుతేవ ఫలపుష్పముఖవస్తుపటలములును

తే. గీ. తనకొలమ్మునఁబొడమినచుహజు నొకనిఁ గట్టికొని కాఁపురము సేయుసలికి కెట్లు
గలుగ నేర్చును! సానిగా వలచి వలపుఁగలుగఁజేసెడి కలికిమిన్నలకు దక్క.

తే. గీ. జగతి "వాణిజ్యకృషికర్మ జనవరేణ్య, సేవనమ్ముల సంపదల్ చేకుఱు" నని
చెప్పుదురుగాని తగినట్టియొప్పుగలుగు, సానిగడనకు నవి శతాంశములు గావు

సే. గీ. నీచ మిదియంచుఁ గొందఱు నీతివిదులు, పల్కుదురు సత్యమే యట్లుపల్కువారు
పలుపువృత్తుల నిట్టినైచ్యం బొకింత, లేదె! యొక రొండొకరి నెంచలేకపోరు.

శా. ఉద్యోగం బని ప్లీడరీ యనియు నెంతోమంది శ్లాఘింతు రా
యుద్యోగంబు శ్వవృత్తి రెండవది తా నొక్కొక్కడన్ మాపనిన్
"వృద్యంబా" ననిపించు లాభమది యొందేఁ గల్గు నావృత్తి సం
పాద్యం, బయ్యది పూజ్య మెల్లగకు, నీచానీచతల్ చూచిరే! 108

సీ. కలికి యింతకు వానికెలన నల్లనిల్చి యొయ్యారముగ వీడె మియ్యకున్నె?
యబల యింతకు వాని యక్కుచక్కఁగఁ జేరి ముద్దుముద్దుల మించ మురియకున్నె?
వెలఁది యింతకు వానితలఁపులూరఁగఁ జెక్కుఁగొట్టి నెట్టన ముద్దు వెట్టకున్నె?
గరిత యింతకు వాని మరుకేళిఁ గరఁగించి కరువంపు బిరుదంబు గాంచకున్నె?

తే. గీ. అప్పలన లేనిపోనిదైవట్టి పలుక, గాంచి యితకు నాయెమ్మెకానిచేత
ననునయమ్ములవెన్నియో గొనకయున్నె?, చెనటిదైవమ్మ నన్ను వంచించె నకట 8

మ. పలికెంబో! చెలి నన్నుఁగూర్చి "యొరునిన్ బ్రాణేశుఁ గావింపు" మం
చలుకన్ లోఁగొనియున్ వలిం దెలియనీ కంగీకృతిన్ జూపి ని
ష్కులుషంబౌ మదినూని వాని పతిగన్ గల్పింగ నా కొప్పునే?
తెలియంజాలక మోసపోతి నిటు నీతిన్ బూనఁగాఁ జెల్లునే? 9

చ. వెలచెలిఁగూడు టొక్కయవివేకము కూడినవా రసత్యముం
బలుకమి గొప్పతప్పిదము, పాము నెడన్ బుజుర్తనమ్ములా?
వలపుట, దేవుఁబట్టి సద్వ్రతంబగు పత్రిఁ గూర్చు టొప్పు నా!
వలపున ముంచి మించి యిటు వాతులు గోతు లొనర్తు రక్కటా! 10

తే. గీ. అనియెదఁబో! లంజెయాటఁ దాఁట్టిమాట, నాకుయోగ్యతయెయ్యెడఁబూదిఁగలిసె
వేయునేటికి? వెలయాఁడ్రౌ డాయువారి, కంతకన్నను దుర్వృత్తు లబ్బ నిజము. 11

ఉ. దానునిరీతి దానిపదతామరసమ్ముల నాశ్రయించుటం
జేసికదా? మఱెవ్వరును జేయనిదుష్కృతి నేర్పుకల్మి న
న్నాసతి చేయఁజేసె నకటా! యిటు లెప్పుడు చెప్పె నప్పుడే
కోసిన నేమిపాప మగుఁ? గోమలినాలుక యింతయింతగన్. 12

తే. గీ. నన్నుఁ బినప్పటనుండియు నమ్మఁజేసి తుదకు నీగతి దుర్గతిఁద్రోసి యొరునిఁ
గలసి కులుకుచునున్న యక్కులికిమిన్న, కేల తగుఁదు? నాయుసు రిహమునందె. 13

ఉ. ఇంతయపాత్రురా లగుట యెల్లనెఱింగి యదేమి పాపమో
యింతిపయిన్ మనంబు పరువెత్తెడి నుత్తలపాటు జెందెడిన్
గాంత దలంచి, యౌర! "విటకాండ్రకు నెక్కడిమాన?" మంచు ని
ర్ధాంతముగా వచించు కవితల్లజు లూరక వాఁగువారలే? 14

ఆ. వె. నిష్కళంకులైన నీటి కాండ్రకు మనం, బీయ కిచ్చినట్టులే నటించు
రకట! వారకాంత లద్దమ్ములో మోమ, దెట్టులుండు? నిదియు నట్టులుండు.

తే. గీ. మచ్చిబంగారమునఁ గాదిమూర్తియైన, వెలవెలందులపేరు లోనలఁ గూర్చి
యట్టివిటులను ద్రవ్యతుల్యం బటందు, బలువురును నవ్వు టిద్యాది పైరికోసను 16

తే. గీ. తనవువందలి సారమంతయు నయితము, నల్లనల్లన లాగి వారాంగనాజ
నంబు తమవిటులను సుబుసంబు భుజఁగు, లను వెడలఁద్రోతు రిదిగనఁగొనరు విటులు.

చ. కొలమునఁ బుట్టి ట్టియొకకోమలిఁ బిన్నటు వాఁడ పెండ్లియై
కలిగినయంతలో సుఖముగాఁ దలిదండ్రులు నత్తమామలున్
బలుమఱు దన్ను మెచ్చఁ గులపావనుఁ డన్నయశమ్ము లోకమం
దలమఁ జరించువాఁడిక నా ? నిజమైన సుఖమ్ము లెమ్మయున్. 18

క. అని యాతఁడు పలువిధములు, మనమునఁ దలపోయుచుండె మానినియు నదా
రునిఁ గలసి పలుసుముల నొ, య్యన నాలో నితనిఁ దలఁచి యాత్మగతమునన్. 19

మ. అకటా! నన్నెడఁబాసి యెన్నఁడెఱుఁగం డవ్యాజరాగార్తియుం
డొకరిం బోలెడివాఁడు గాఁ డతఁడు నన్నుల్లమ్మునం దెంచి యే
మికతల్ సేయఁగ సాహసించెనొకో ? నామేలెల్ల నమ్మయ్యె న
మ్మిక నాపై నికనైనఁ జేసెదె ? యెటో ? వాని తప్పెట్లగున్ ! 20

ఉ. వేడుక గాఁ డఁటుంచు మది వెక్కసమించుక లేక "యిండొరుం
గూడఁగఁ దెమ్ము" టంచు నన్నఁగూడునె ? విత్తము కారణమ్ముగాఁ
జూడనిచూడ్కిగా మఱి బొజుంగులఁ గూడినఁ గొంతఁ గూడుఁ గా
కేడవి యిట్టి రత్నము? లేమనిచేసితి? నేను మెత్తురో? 21

క. నా కారణమునఁ గులమున, కే కానికళంకు గల్గె నిహిహీ! యిటువై
నాకత విన్నను గోయక, యే కాముకు లిచ్చగింతు! రిల వెలచెలులన్. 22

ఉ. ఎంతటి మానహీనులో! మఱెంతటి యేవము లేని పందలో!
యెంతటి బుద్ధిశూన్యులో? మఱెట్టిరో? విటకాండ్రు, బోగపుం
గాంత లొసఁగు పేయములు కన్నులనిండఁగ నెప్డు చూచుచున్
బంత మొకింత పూన రిది శాలికవృత్తిఁ జూడ రక్కటా! 23

శా. తాఁ గుంబోతుల బుద్ధిహీనత గదా! ద్రవ్యమ్ము సారాయికిన్
రాఁగా పోతు, వదెంత కట్టుచెడినన్ రాఁగండ్రురే? వా రహో!
బోగంపుంగొల, మట్లనే విటులను రోఁ గాప్తి దుశ్శీలమై
బీగం బూడ్చిన పెట్టెయై యిటుచెడెన్ బెంపేది నానాఁటికిన్. 24

గాదుగా? యీసుడిగాలిఁ గూడినఁ జిక్కుల్ వెట్టుటల్ మాని యుం
దముగన్ సాఁగగనిమ్ము నాయనఁ నీ వాలింపు మిప్పట్టునన్. 33

ఉ. ఈవును గాలియుం గలసి "యేణదృశన్ విడనాడి యేగు టొ
ప్పే? వల" దంచు నన్నిపుడు వెక్కసఁ ద్రిప్పఁ దలంచినా రహో!
దైవబలమ్ము చాల దది తల్లిఁ దా నడతార మంది న
న్నీఁధి లాగుచున్న దిపు డేమియు నేయఁదు మాతపత్రమా. 34

మ. జడ మీ వయ్య జగమ్ము లెక్క తన నుచ్ఛ్వాసమ్మునం బొల్చు న
ట్టిఁడు నీకున్ సహకారి యౌటు నను బోట్రిం జేర్ప నుంకించి నా
యకుకున్ వెక్కసమిచ్చె దీ, వౌ యలతాపాత్రిన్ వారింపన్ గనా!
పుడమిన్ బుట్టితి వాతపత్రమ! నినుం బోలన్ దలన్ దాల్చఁగన్. 35

వ. పదపడి భూమశకటం బారోహించి యతండు.

ఉ. తల్లిని దుష్టగాలను చెడన్ దఱపోయు మఁ దండ్రి యోగ్యతా
భ్యల్లపనంబు నూరక యహో! యని మెచ్చుచు సారెసారె క
ప్పల్లవపాణి చెయ్యుల జపం బొనరించుచు నేగె నన్న వా
రెల్లను నంతరాయ మగు టెంతయు శత్రులు కోడె కాంక్షతోన్. 36

క. రై లేదేఁ గారణమున, జాల మ్మొనరించి వెనుకజరగినచో నా
వ్యాళోలుఁ దదితరుఁ "దనకను, కూలించెడి జాలి" యనుచుఁ గొండొక నెంచున్ 37

ఉ. చిక్కినమేనితో వగపుచెందెడి డెందముతో స్వశోకపుత్రభన్
దక్కినమోముతోఁ దనదు నాప్రవరున్ జనుపుత్రుఁ దల్లి వా
మిక్కిలి గారవించి మును మిందిన దెంచక, పై నొకప్డు పెం
పెక్కఁ ఘక్క నీతి జనియింపఁ బ్రసంగ మొనర్చె నీగతిన్. 38

చ. మును పెటులైననున్ గృహము మోపిక నీకిఁకఁ గాలిసంకెలా
టను వెలియుంగదన్న? కడుఁడక్కరులన్ దఱిఁ జేర నీవు మ
న్న? నయముచందమున్ దెలిసి నాయనకున్ యశ మబ్బఁ జేయు మ
న్న? నెనరుగల్గు మన్న? ద్రవిణంబు వ్యయింపకు మన్న? వమ్ముగన్. 39

ఉ. ఏపని కేడకేఁ యయిను నేగిన నయ్యెడ గేహవిస్మృతిన్
గాఁపుర మాచరించు టది గాదు గదన్న? కళత్రి మెంతయుం

దాపము నందుదుష్కృతులఁ దారకుమన్న ? యొకింత పూర్వులన్
దాపసచర్యలన్ దలఁచి తద్గతి నిల్పఁ గదన్న ? మేటివై. 40

ఉ. వచ్చెడి రైతులన్ గని జనా బెవరిత్తురు ? సాహుకార్లకు
న్నచ్చెడిరీతిఁ జెప్పఁదగు నాయకు లెవ్వరు ? తండ్రి నాఁడె తా
నిచ్చినసొమ్ము పుచ్చుకొను టెవ్వరు ? కోరెడివారి కప్పు లి
ప్డిమ్మ టదెవ్వ ? రెక్కడికి నేగిన నక్కడ కాఁపురమ్ములా ? 14

తే. గీ. ఎన్ని జన్మమ్ముల జేసి ? రెన్ని యగ్ని, హోత్రములు తెచ్చి ? రెంతటి కన్నమిడిరి
భూము లెందఱికిచ్చిరి ? పూర్వు, లందు దుర్వ్యయంబింత లేదు దుందుడుకు చనె ?

తే. గీ. ఎంతదారిద్ర్యంబు ముందు నీవింటనుండి, తీసికొనిపోతి ! వానిఁదఁ దీఁగెకతన
మసలఁజంపెదదియెంత ? యెఱుఁగుదే ? కుమార ? యిది యెల్లనెయ్యెడ మణఁగిపోయె.

ఉ. ఈగతిఁ జెల్లఁజేయు వన మెక్కడిలెక్క ? ధరాపురందరుల్
జోగులుగారె ? యాన్నృపులఁ జూచుటలేదె ? యి దిట్టులుంచు మే
లాగు సహింతురా ? సకలలక్షణముల్ గలభార్య యుండఁగా
బోగపుదొత్తులన్ మరగఁబోయెడినీకత లాలకింపుమున్. 44

ఉ. వత్సరమైనఁగాదు జనవంద్యుఁడు తండ్రి గతించి, నీవు నే
తత్సమయమ్ము నిక్క మియుఁ దార్చుటమాని యయోగ్యతాఖలుల్
కత్సిగ లగ్నిజాతులకుఁ గూడనిచేఁతలు లంజెముండ లం
దుత్సుకతాధరంబు గొనుటొప్పునె ? కర్మము కాలిపోనఁగన్. 45

ఉ. వింటిని నీమువెఖరులు వీనుల సూదులు సూడినట్లు లే
యంటును సొంటు లేని కుల మక్కట ! గంగను గల్పు నిన్నుఁగ్రై
కొంటిమె ? కొంటె మెప్పెలను గూడుక గాడిదరీతి బోగపుం
గుంటలయిండ్లు దూరెదవె ? కూళవె ? గోలవె ? జేలవే ? సుతా ! 46

శా. అన్నా ! వైనఁట బ్రాందియుఁట విసికీయుం టక్కటా ! నీవు నీ
విజ్ఞానం బెటులబ్బెరా ? ద్విజకులావిర్భూతియున్ బానమున్
మున్నెచ్చో విసలేదు నీకుతల నే మున్నెన్ మహాపాప, ము
చ్ఛిన్నంబయ్యెఁ గులమ్ము నీకతన ఛీ ! ఛీ ! గోత్రవిధ్వంసకా !

చ. నయము భయమ్ము నెమ్మదికి నాఁటఁగ దల్లి యొనర్చుబోధ య
మ్మెయి వినిమోమువంచి పయిమిక్కిలి యుత్తరమీక "యెవ్వఁడ

ప్పయనములోని చెయ్వులను బాయక యిమ్మెయిఁ దెల్పె" నంచుఁ ద
ద్దరుఁ దనలోన సిగ్గిలు సుదాముఁడు లో మఱియొంతు దోఁపమిన్. 47

తే. గీ. అట్లు వినయంపుఁగనియయి యున్న పాన్పుములకు సయితము లేదని మగుడఁ గాంచి
లోననించుక చింతించి లోలహృదయ, యగుచు వాసతి దానిట్లు లనియె మఱియు. 48

చ. ఎఱుఁగక చేయు కార్యముల కేమి? యిఁకేనియు బుద్ధిఁగల్గి య
ద్దురితము వాయఁ పొంటె గురుదోషనివారిణి గంగ కేగి య
క్కఱ మెయిఁ దండ్రికిం గతులు కల్పనచేసి పురమ్ముఁ జేరు న
త్పరమును గాకమున్న యిటుసల్పుట యొప్పగునంచుఁ బల్కుడున్. 49

చ. "ఒడవిననీ గ్గడంప నిది యొక్క యుపాయము గల్గె" నంచు నొ
ప్పిదముగఁ దల్లియాజ్ఞ గొని పెద్దలఁ గొంచటి వామె తోడుగా
సదమలబుద్ధులన్ బనుప సాయముగాఁ గొని యాతఁ డేగ న
మ్మదనవారాలయమ్ము పరమప్రథితార్థపురాశి గాశికిన్. 50

సీ. అకసగ్గునకు వింతలై స్వాంతమును దన్పు దేవళమ్ముల దీప్త లావహిల్ల
నిరుపరిక్కలను నభోంతరము దాఁటిన మేటి మేడలసౌరు మిర్మిట్లుగొలుప
నెటుఁజూడ నచటనే యింతయాచ్ఛాదనంబును లేని లింగాల పొలుపులెసఁగ
వాఙుశాస్త్రములు నధ్యయనంబు నొనరించువిద్యార్థులెల్లెడ వేళ్క నింప

తే. గీ నెన్నియో దేశములనుండి యేగుదెంచి, నట్టితైర్థికజనము లెప్పట్టునఁదగ
నూత్రిపట్టినగతిఁబొల్చు సురనది పరి, సరమునం దొప్పుఁ గాశికాపురవరంబు.

తే. గీ. ఎన్నియోఘట్టములు, నటనెందఱొ, రోమహాత్ములు సన్న్యాసు, లామహాను
భావులను గొల్చి జ్ఞానమ్ము వడయుగేస్తు, లెల్లయెడ నొప్పునప్పురం బింపు నింపు.

శా. గంగాస్నానము నాచరించి పిదపం గాశీశు సేవించి మోఁ
దం గామామరకల్పవృక్షమగు తద్భాగ్యన్ విశాలాక్షి భ
క్తిం గేల్మోడిచి మ్రొక్కి మాధవముఖాదిత్యార్చనల్ సల్పు పూ
తాంగుల్ వేలకువేలు వొల్తు రట నిత్యంబున్ విముక్త్యర్థులై. 53

ఉ. తాదృశమైన యప్పురముధన్యత నెవ్వఁడు సెప్పఁజాలు? బ్ర
హ్మాదులు లోకజాలము లయంబగునప్పుడుఁగూడ దాని గౌ
రీదయితుండు శూల మలరించి తదగ్రమునందు నిల్పు నిం
కేదగు దానిసాటి? నతియింపఁగఁ జెల్లదె? కాశికాపురిన్. 54

ఉ. ఆపురిఁ జేరి యాతఁ డటఁ నాదరణీయము లైనకృత్యముల్
వే పచరించి దానములు వేలకువేలుగ నిచ్చి భూమిచే
బాపల గొండఱిన్ దనిపి పైగయ కేగి యటన్ బితృప్రియా
కారిపురాత్రిఁ జేసి యటఁ సాఁగి స్వదేశము బోవుదెంచుచున్. 55

చ. తిరిగి యటఁ గాశి కేగి యట దేవళముల్ మఱికొన్ని చిత్రముల్
పరిపరిగాంచి గంగ నటఁ బట్టఁ బ్రియాగకు నేగి తత్పురి
త్స్నగసముఁ బట్టి యప్పురిని సొంపగు కోటఁ గట్టి మేటియ
బ్బాసలు నూచి యేగెఁ దనపోలికి నాప్తులతోడ వేడ్కన్. 56

తే. గీ. జనని కభిషేక మొనరిఁచి సతియుఁ దాను, సమ్మహాగంగఁ బూజించి యగణితముగ
విప్రులకు నన్నదానంబు విస్తరించి, తల్లి సంతసమంద నుదారుఁ డంత. 57

శా. సంసారస్థితిఁ జక్కఁ బెట్టుకొనుచున్ జాయన్ దగన్ జూచు చా
శ సాపాత్రిము గాఁ బ్రవర్తనము మెచ్చన్ జేయుచున్నంత మీ
మాంసన్ జేయక తల్లి యాతనియెడన్ మర్యాద నీక్షించి "ప్రి
థ్వ సప్రిక్రియ తగ్గ" నంచుఁ దలఁచెన్ దత్త్వంబు నూహింపమిన్. 58

ఉ. "అచ్చెలిఁ జూచు టెట్లు? లిఁక నయ్యెడ కేగను పాయ మెద్ది యే
యొచ్చెము చేసినన్ జనని యొప్పదె!" యంచుఁ దలంచునంతలో
నచ్చపలాక్షి యయ్యెడకు నాత్మపురమ్మున వీడి మున్నె తా
వచ్చుటఁ జేసి కమ్మఁ దగవ్రాసి తనంతన యంపె దూతికన్. 59

ఉ. వచ్చిన దూతిచేతి "కిదె వచ్చితి" నంచు లిఖించి యిచ్చి పో
నిచ్చి మనమ్మునన్ బెరుఁగు నిచ్చలు మోమునఁ దోఁప నంతలో
హెచ్చెడి యుత్సుకత్వమున కెద్దియుఁ బారము గాక యేగెఁ దా
నచ్చపలాక్షిఁ జూడఁగ నుదారుఁడు లోన భయమ్ము గ్రమ్మఁగన్. 60

ఉ. "ఉత్తరమైనవ్రాయ విది యుక్తమె? నీ" కని యింతి పల్కఁ "జో
"మ త్తరమేమి చెప్పుదు సహో! మది నెంతటి పేర్మి లేనిచో
న త్తరళాక్షి తాన యిటుకై చనుదెంచునె? యెంతదూర మ
ప్పత్తన! మంబ హేతువునఁ బంకిలచిత్తుఁడ నైతి నక్కటా! 61

ఉ. అంబయెఁ గాదు హేతువు రహస్యమునం దొకయుత్తరంబు నే
నంబుజనేత్రికిన్ బనుప నావె నివారణ చేసెనే? నిమి

త్రం బిట వేఱుకా దొక స్వతంత్రత లేమియు కాదు కాదు దేం
దం బదియేమొ! యెప్పనికిఁ దార్చిన నేరము నాఁటనుండియున్. 62

చ. కలికియె కారణంబిచటఁ గాఁదగు నత్తరళాక్షి వీడి నే
వెలికరుదెంచు టాదిగ నవీనవిధం బొనఁగూడె నేమియుం
దలఁపదు చిత్త, మేమిత్రికతం బని చింత యొనర్పఁ దాను నం
దులఁ జొరబాఱి దిప్పటికిఁ దోఁచె నిజమ్మది" యంచు నెంచుచున్. 63

ఉ. నేరము నేయు మానవుఁడు నేతకడన్ జనుపోల్కె మోమునం
దీఱు విదైన్యమున్ మతి మదిన్ గదు భీతియుఁ గొంతలజ్జయున్
వారక తోఁప నచ్చటుల వారిజలోచన యున్న చోటికిన్
దారె నుదారుఁ డట్లుగుఁ దన్యులపట్లఁ గృతాపరాధికిన్. 64

క. నలుగడలు గాంచి పదపడి, జలజముఖి వసించు గృహముచాయఁ జని యటన్
గలకలికిఁ గాంచినంతన, పులకలు గనుపట్టె మేను పొంపిరివోయెన్. 65

చ తనఁ గని మాటలాడ దొకదండము వెట్టను మోము నెత్త ద
క్వనరుహనేత్ర యుంచు మది నంత యొకింత యుఁ గాంచ కల్లన
ల్లనఁ బ్రియురాలి దగ్గతి నిలాసగతిన్ జెను గ్రిట్టి మోము నె
త్తిన శతపత్రనేత్ర యొక తీరున నశ్రులు జాలువాఱఁగన్. 66

ఉ. కొండొక సేపు నెవ్వమెయుఁ గొంటెతనమ్మున మిన్నకుండి "నీ
మిండతనంపుఁ జంద మిది మేలుగనున్నది యిట్టివాఁడవా?
వెండియు రేపె వత్తునని వెళ్లినదే యొకసంను చేసి రా
కుండుట నీవుఁ జెల్లె నిటు లొండొరు లెవ్వరు నేస్తురే బళీ!. 67

చ. ఇరువదియేండ్లప్రాయు మదియే గనుచుంతకు మిన్నకుండి పై
"నిరువదియేండ్ల యుప్పు చదు" వన్నటు లే నిరుఁగట్టికొంట యి
క్కడఁగని విచారమందుటకె కాక సుఖమ్మగునా? నిజమ్ముగాఁ
బురుషుల నమ్మమానినికిఁ బొసఁగుటనక్క సదొండు గల్గునే. 68

మ. మతు లేకీకరణమ్ముగాంచకయె నమ్మన్నమ్మికల్ చాలకో
కుతుకంబుల్ నెఱవేఱకో సిరులు లేకో యేదియో మూఁడియో
సతికిన్ భర్తయు నత్తవొక్కయెడ నీసఖ్యమ్ము చేకూఱ దు
ర్మతియై దానికి దైవ మెయ్యదియొ సంపాదించుఁ బ్రత్యూహముల్. 69

చ. నినుఁ గనుఁగొంట కిక్కరణి నేనయి వచ్చితి నన్నమాట యే
వనితయు నేని మాకొలము వారలలో వినె నేని నవ్వరుం
డురె? యొకొ నేని సాధ్వుల కిటుల్ చను టొప్పునె? దానికేమి ప్రీ
తినిఁ గనఁజేసి తిట్లునగుదెంచుటఁ బ్రియమ్మున గోర్చి యెమ్మెయిన్. 70

ఉ. "లంజెగదా!" యటంచు మది లక్ష్య మొకింతయు లేమి వీడితే
నిం జనుగాని యొక్కచెలి వీడి యొకొక్కకఫక్కె నొప్పు "నీ
మంజులవాణి యిట్టి" దనుమాదిరి నిర్ణయ మాచరింప న
క్కంజభవుంకు నేరఁ డనఁగా నొకపాటి బొజాం గెలుంగునే. 71

చ. కులచెలియై జనించి కనువేఁదులు చెందినపట్లు దానికిన్
గలుగుట యబ్బురంబె! పలుకష్టము, లొడ్ల ననంగ నేల? చం
చల మగు నాదు నెమ్మనము చందము నింద యొనర్తుఁ గాక యే
లలనలుఁ గాంచిరో? సుఖములన్ వలపుల్ తలకెక్కిపిమ్మటన్." 72

చ, అని పలుమాఱు దూఱు చెలియన్ దగుమాటలు సెప్పి కొంత సి
గ్గున కగుచెయ్వులన్ గొలిపి కొంత క్రియమ్ముగ నుపవిష్టఁ గా
నొనరిచి మించు పేర్మి దళుకొత్త "సఖీ! నినుఁ బాయు టాదిగా
మనమది యేమొకో! పనికిమాలిన దయ్యె నిజమ్ము నమ్ముమీ. 73

ఉ. ఇంతియు కాకయున్న నిఁక నేపని నేనియు మాను టొప్పఁగా
కింతిరొ! నీకు నుత్తరము నేనియు వ్రాయనె? యంత పంపనే?
కంతునిసాక్షి నేఁడు నినుఁ గాంచితి నెమ్మన మెప్పటట్ల ని
శ్చింతతఁ గాంచె నింతయును సిద్ధము నమ్మిన నమ్మకుండినన్. 74

ఉ. వచ్చిన తత్క్షణంబ మగువా! యలకాశికి నేగి వాఁడఁ బై
నచ్చుగఁ యాత్రఁ జేసికొని యక్కడనుండియు మొన్న వచ్చితిన్
బచ్చని వింటిజోదుకృప వచ్చితి వంతన నీవు, యాత్రికున్
వచ్చె ఫలంబు, నిక్క మిది వంచన సేయఁడు దైవ మెవ్వరిన్. 75

ఉ. ఈవును నేనునుం గలసి యియ్యెడ హాయిగ నుండవచ్చు సౌ
ఖ్యావహ మీపురంబు, మనకన్నియు మంచివె కాని తల్లిగా
రీవిధ మొప్పదామె కిది యించుకయున్ దెలియంగ రాదు కో
పావిలయైనచో మనకు హాని ఘటించుట నిక్క మెమ్మెయిన్. 76

ఉ. కావున నీవు గోప్యగతిగా వసియింపుము నాదు నామ మెం
దే వచియింపఁబోకు వచియించితమాత్రఁ యేమిగాని యే
యోధికైన గోప్యగతియే కడు శ్రేయముఁ డాఁగుసంచు నన్
గేవల మెంచఁగూడ దపకీర్తియుఁ గీర్తియు రెండు నట్టివే. 77

ఉ. పేరగుదాన నీవు, కడుఁ బెంపుగలట్టిది మాకుటుంబ, మీ
కారణ మై రహస్య మది గావలసెన్ మఱియొంకరీతి యే
నే రెటు సంచరించెదరొ యేరికిఁ గావలె నింతవీటిలో
నూరనుగాని యిట్టిపురి నొక్కని కొక్కనిజోలి గల్గునే. 78

క. మీపురము లొక్కపదియా, మాపురి విడఁ దీసి కట్ట మానిని! దీనన్
గాఁపురము సేయునేన్నులు, దాపునఁ గలవారిపేరె తా మెఱుఁగరనూ 79

తే. గీ. అట్టిసంగతిలో నిటు కథిక మూర, ముందు మాపీథి, యిమ్మ్యోమనుండు నిన్ను
నెవఁడు గురించి మాతల్లి కెఱుఁగఁ జెప్పు!, నట్టియున భయమేలన? నదియు వినుము 80

ఉ. మీపురిలోన నే సలుపు మిక్కుటపుం బను లట్టు లుంచు మే
యోపను లేను నీపడకయింట నొసర్చితి వాని నన్నిటిన్
దాఁపక చెప్పినా రెవరొ తల్లి, కిదెక్కడివింత? జారతా
వ్యాపృతి తానయై జగముపై కనుగున్ నిజ మింత కోమలీ." 81

క. అనవుడు జలజాక్షి యుబ, గ్గున మండిన పగిదిదోఁపఁ "గులవనితగ న
న్నను జూచెదనను టది యెం, ల్లను బోయెనె? యెంతలోఁ గులటనైతిఁ గటా! 82

క. జాయఁడను దుర్వ్యశయు పర, నారుల, జోరగతిఁ గూడు నాయకుఁడవు నా
మారమణిఁ గొనిన నీయప, కీరితి లేదిపుడు నీదు కృప వింటి నిటుల్. 83

క ఏలంటె వమ్ముఁ? దానై, వేలకువేల్ మైళులున్న వీటికి నీ కి
ల్లాలననుకొంటి "గలదే, రై" లను మల్లెనఁ దనరు రానేల? యిటుల్. 84

క. యోగినిగతిఁ గాలమ్మున, నే. గడపుచునుండ నీవు నేరుపమై నన్
భోగినిగఁ జేసి చింతా, భాగినిగాఁ జేయనుంటి పాడయితిఁ గటా! 85

తే. గీ. మొదల మాతల్లిమాటల మోసపోక, పురుష సాంగత్యమున బుద్ధి పోవనీక
యుండ నాయుండయొక్కనికొప్పఁ జెప్పి, వానినా నాఁడ పోఁగొట్టి వ్రతము గొంటి.

ఉ. దానికి నంతరాయమయి దాపర మైతివి దానికేమి నా
మాన మెఱుఁగకే కడునుమాళిమునన్ దగునిన్నుఁ జూచి మా

యూఁధిగా గణింప కకటా! తుద కెందుకుఁగాని పండనై
బానిసతొత్తనై చెడితి భారము నీకయితిన్ వృథాగతిన్. 87

ఉ. ఎందుకు సృష్టిచేసెఁ బరమేశ్వరుఁ డీచెడుగుంగొలన్ను? పై
నందముఁ జందమున్ గలుగునట్లు లొనర్చఁగనేల? చేసెఁ బో
పందల కెల్ల విందొనరుపన్ విధియింపఁగనేల? యారకే
కుందఁగఁజేసి యిక్కరణిఁ గుత్తుక గోయఁగనేల? యక్కటా. 88

ఉ. అందముఁ జందముం గనియొ యాదరము న్నిజ మంచు నమ్మియో
వందలు వేలు నీయఁదగు వాఁడనియో యొకమాయ కానికిన్
డెందము నమ్మి వానికిఁ గడిందిగఁ బ్రాయము ధారవోసి యం
తం దను వీడ నేడ్చెడి యనాథలనన్నఁ బుట్టఁ జెల్లునే? 89

చ. కలుగుట దుర్లభం బొకఁడు కల్గినఁ బెద్దరహస్య మందుకున్
దలరక యొప్పుకొన్నఁ దుదినాకను నెగ్గము వానిచెల్మి యే
వెలవెలియోని యొక్కయెడఁ బ్రీతియొనర్చుట తప్పిదంబు, పం
డలయినఁ దప్ప నొండుఁగతి కన్యలు దీన జనింపు టొప్పునే. 90

చ. కలిమిని లేమి నొక్కగతి గాఁవమున్ జపదించుచున్ దళ
త్తళ గల జవ్వనమ్ము దిగఁ ద్రావిననప్పటి నేనిఁ బూర్వజం
జెలిమి యొకించుకేని యెడసేయక వెన్మటి గల్గునంతి కం
జలి యొనరింప నొప్పు దివి వత్పతి యుంచినసాని యేనియున్. 91

సీ. తగినకంతాన మున్నదియమంద "నాథ! నా!" యని వార లెవ్వాని ననఁగవలయు?
అన్నదమ్ములు గొంవార్హ లుండిన వారు తల లేదనంచు నెత్తఁగవలయు?
తనుఁగన్నతండ్రి యుత్తముఁడేని యతని మిగమ్మెనిగతిని దాఁగాంచవలయు?
ఏదేని శుభకార్య మేర్పర నెవనితోఁ గాంతమైఁ బీఠ మెక్కఁగవలయు?

తే. గీ. నక్కటా! తాను బాధకు టుట్టుపడ, వెతకముదటివారల వెలికిఁ దార్చ
రో వెలందుల పుట్టువుల్ రోఁతగావె, యెఱుఁగనేర రీమార్గమ్ము హీనమతులు.

ఉ. అట్టిరులమ్మనం బెటులనైన మహేమి పురాకృతమ్మునన్
బుట్టినదానికిన్ వగవఁ బూనిన లాభము గల్గఁబోదు తాఁ
గట్టి-కర్మముల్ కుడువుగాంచక తీఱునె? యిప్పుడేని యీ
గట్టు నెఱింగి యొక్కరునిఁ గూడి దినమ్ములు పుచ్చఁ జెల్లదే? 93

ఉ. ఒక్కనిఁగూడి కాఁపురము నొప్పుగఁ జేసెడి దానవౌదురే
ఫక్కిని జారుఁడన్న దురుపద్రవముల్ గలిగించు వింటి నీ
చక్కనిగాక సర్వజనసమ్మతమై మళయాళమందుఁ జే
రెక్కుడి నగ్రజాతులకు హీనకులాంగన తోడి కూటముల్. 94

ఉ. కావున నన్ను జారగతిగాఁ గయికొందువయేని వొల్ల "భా
ర్యావిధిఁ జూచుకొ" మ్మనుచు నప్పుడ చెప్ప మదంబ, దానికి
న్నీ వెటు లొప్పికొంటి? వది నేఁడిటులన్ గిసురింతె? మాకొలం
బేవగదైన మాసరణి యేవము నైఁప దదెన్నిభంగులన్. 95

క. అనవుడు సుదారుఁ డచ్చెలి, కను "నే లోకోక్తి నంటి నది నీకింతన్
మనము నలయించెనే? యే, మని భార్యగ నిన్నుఁ జూడననుకొంటి? చెలీ. 96

ఉ. చక్కఁదనమ్ములేదొ? గుణసంపదలేదొ? వయస్సులేదొ? బల్
తక్కులమారిగావొ? వివిధమ్ములు విద్దెలు నేరవొ? నినున్
జిక్కనికౌఁగిటన్ జనవు చేసినపిమ్మట భార్యగీర్యయున్
మక్కువకానె? యేల యనుమానము? మానుము మానినీమణీ 97

ఉ. నమ్మవుగాని నీవు మదిసాటినదాదిగ భార్యఁ జూడఁగా
నెమ్మది సమ్మతింగనదు నేరము లూరక తోఁచు దానిపై
నెమ్మెయిఁ బూను నీగుణములే కద! యింతకు గారణమ్ము, నీ
సొమ్మనుకొమ్ము నన్ను దిరిశుద్ధిగ మాటలు వేయు నేటికిన్. 98

గీ. విప్రులకు నాల్గుజాతుల వెలఁదులందుఁ, గలదు స్వాతంత్ర్య 'మది నేఁటి కలియుగమునఁ
గాదనుచుఁ గొందఱడ్డిరి గాని యింత, మాత్రమున, బోయెనే? పూర్వమతమునకియు.

సీ. బ్రాహ్మణుఁడై పుట్టి పరమచండాలితో సంసారియైన విశ్వాసి యొకఁడు
మూగుర మున్ జంపినయుండమోపని గట్టికొని గృహస్థయిన మునుఁ డొకండు
ఏకమత్స్యమున కియ్యవి మెప్పుచుఁ గులాచారముల్ వదలినజాణ యొకఁడు
"పింగాళిచిప్పకు వెండిగిన్నెకు భేదమున్న దే!" యనినొడి యోగ్యుఁ డొకఁడు
తే. గీ. వీరలేకద! సభలలోఁ బెద్ద లిపుడు, మనకు మర్యాద వీర లేమని యొనర్ప
రింతకును ద్రవ్యవంతున కెవనితోడ, నేమిపని? వెలి యాతని కేమి సేయు?

చ. జనని గతించుదాఁక వొక, చందమునన్ జననిమ్మ మీఁద ని
న్నను స్వగృహమ్మునం దిడుచు నూతనబుద్ధి యొకింతలేక నా

జన మదియెల్ల నీకు నుపచారము సల్పెడు నట్లొనర్తు న
న్ననియెడి వాఁడొకండు గలఁడా? మఱి తల్లి కొకింత జంకెదన్. 101

ఉ. దాఁపఁగనేల? విన్ము మును తండ్రి గతించెడువేళ ద్రవ్యమున్
మాపి మదంబతో "నిది త్రిశుద్ధిగ నీ మరణంపువేళ నీ
వీపసివాని కిమ్మిచటు నించుకయేని వ్యయింప కంచులో
నోపినమాత్రముం గలిపి యుచ్చగతిన్ బొనరింపఁగాఁదగున్." 102

తే. గీ. యౌవనము ధనసంపద యాధిపత్య, మవల నవివేక మిఱ్ఱ్యవి యడఁమ నొక్క-
టొక్కటియె మానవుని నివియొకటునన్ని, యునుబోసఁగ నేనిఁజెప్ప నేముండు సాధ్వి!

చ. నవనవయౌవనుండయిన నందనుఁ డొప్పుగఁ గాంగి చల్లనా
రి వెలయుంపాలభంగి నొకరీతికి వచ్చెడుదక్క జాగరూ
కవిధిని సర్వముం బయినిగాంచుచు ద్రవ్యము చేతికీక పై
న్యవహృతిశాలి యైనయపు డంతయు వానికిఁ జెందఁజేయుమీ. 104

చ. అని పలునీతులన్ దెలిపి యాపెకు సర్వము నప్పగించెఁ గా
వున మన కామెసమ్మతిని బూనక చెల్లదు దానఁజేసి ని
న్ననిచెద వేఱుగాఁ, బిదప నోపిక వెట్టితివే? యెల్లగన్
బనిఁగొను దానవై మెలఁగవచ్చును బొచ్చెములేనితీరునన్. 105

చ. అవుడు నవ్వెఁదియును నక్కట? యెందుల కింతసోద? నీ
జనని శతాబ్దముల్ సుఖవశమ్మున నుండెడుఁగాక నీధనం
బును సుఖముండెఁగాక నను మోసము చేయక భార్యగాఁగఁ జే
కొను టది చాలు వచ్చెఁ బదికోటులు దానన నిక్కమింతయున్. 106

చ. ధనము గడించియుంచి యది తాము గతించెడివేళ నెవ్వరే
నిని గొనిపోయిరే? జగతి నీతి యనీతియుఁ గీర్త్యకీర్తులున్
దనచనువేళ వెంటఁబడు దక్కినదంతయు దూరదూరమై
పనుపడు. దీనికేమి! పదిపాళులు నీకృప గాంచఁగల్గితిన్. 107

ఉ. పిన్నటనాఁటనుండి కడఁబెంకెతనమ్మున నుంటెకాని మా
కన్నెలఁబోలె నెల్లరకుఁ గాళ్ళకు మ్రొక్కెడి దానఁగాను నా
మున్నరికంబు సాగుటకు మూలమవై ననుఁ గొంటివీవు తే
కున్న మఱేమిలే ధనము, లుల్లము చల్లఁబడె న్నిజమ్ముగన్. 1(8

ఉ. ఏమనఁ? దెల్పవాన విను మే మొద లీకొలమందుఁ బుట్ట తే
దేమనుజుండు నన్ననెనొ యెవ్వతె తల్లియొ యే నెఱుంగ న
న్నే మెయిఁ దాను గన్నదెనొ! యిద్యాది పెంచియుఁ బెద్దఁ జేసి బల్
నేమము లోలి నేర్పెఁ? గులనీతికిఁ దాకలమై చెలంగఁగన్. 109

క. ఆనీతులు నామది కిం, తేనిం జొరబాఱ వేగతిన్నెర్పను? చి
త్రైక నెగడనిపక్షికి భా, షానియతి న్నేర్పఁ, గులమ చను ముఖ్యంబై 110

క. సంగీతము సాహిత్యమ్ముం గొమరగు నభినయమ్ము మొగుదలకెల్లన్
సంగతములగుట నాఁడుఁ బ్రాసంగున్ దగుపాటిప్రజ్ఞ జగదీశుకృపన్. 111

ఉ. ఇంతకు నాకొలమ్ము మొద లెయ్యదియో విననైతిఁ దల్లితోఁ
బంతము పట్టికోరినను "బ్రాహ్మణకన్య" వటందుఁ బల్కె నే
వింతవిధమ్మునన్ను వివేకవిహీన ముదంబ గాంచి ని
శ్చింతమెయిన్ ద్యజించెనొ యిసీ! పశుపుంగొల మాశ్రయించితిన్. 112

ఉ. కోపము వచ్చు మీ కనుచుఁ గొంకక పల్కెద మీకొలమ్మునం
దే పగుచున్న దీయధమవృత్తి యదేమనఁ! బెద్దవృద్ధు తా
నే పసిపాపనో ధనమునిచ్చి కొనున్ గను నంత మృత్యు, వా
పాపిని మమ్ముఁ బోటుల నపారముగాఁగని యిట్లొనర్చెడిన్. 113

శా. పోనీ స్త్రీలు పునర్వివాహమునకున్ బోరామి వాదింతు వి
జ్ఞానుల్ పండితు లేమిపాపమొ! ధనాశన్ గూఁతు వృద్ధాత్ముఁడౌ
వానిన్ జేర్చునపాత్రుఁ గూడ దన రవ్వాఁడిచ్చు నన్నొందఁగా
లానం దమ్ముమెయిన్ భుజింతు రిది యన్యాయమ్ము గాకుండునే. 114

శా. కన్యావిక్రియ మాఁగలేని యలవిజ్ఞానుల్ మతేమంచుఁ దా
మన్యాయమ్ముగ స్త్రీ పునఃపరిణయవ్యాపార మాపంగ వే
డ్కన్ యోజింతురు రెండునుం దగనివే కాఁబట్టి యందొక్కటిన్
మాన్యత్వమ్ము మఱొక్కటిన్ దోసఁగదేమాడ్కిన్ బొసంగింతురో. 115

మ. పతితోఁ గొండొకకాలమున్ సుఖములన్ బ్రాపించి పై వాఁడువో
వుటజిన్ మెట్టివిరక్తిమై సకలమౌ భోగమ్ములన్ వీడి బో

డితలన్ దాల్చి యతిస్థితిన్ గనుట పాటింపన్ దగున్ గాని చి
న్నతనమ్మందున నాలుగేండ్లపుడె నా! యిట్టి వైరాగ్యముల్. 116

ఉ. అట్టివయస్సునన్ విధవనై యది యిందుకె ముంగనప్పు డా
బొట్టిడు గాంచి కొందఱు "దీని పూర్వమునం దిటు పెట్టిపుట్టె" నం
చెట్టులొ పల్కెదరు మతి యదే పయి నొక్కనిఁ గట్టుకొన్న నాఁ
డిట్టుల పల్కరాదె? యిపు డెక్కడికేగెఁ బురాకృతం బహో! 117

తే. గీ. స్త్రీపునఃపరిణయములు సేయవలయు, నంచుఁ దర్కింపఁగా నియామకులైన
బాలవిధవలపట్లనా! పండితులకుఁ, గల్గుపాండిత్యమెల్లఁ జక్కఁగనడేమట. 118

శా. సుజన్ మొక్కరుఁడు కాళ్ళునేఁ గడుగరే శ్రావం బటుండెంగ లో
నం "జంకర్" మన మిట్టులుంటి మిసి యంతర్వాణి వీక్షించిరే
నిం బాలన్ వెలియంచు నొక రేని వారి వారింప రి
క్కాంబాక్షుల్ శమధర్మశాస్త్రములన్ గప్పెట్టి రెప్పట్టునన్. 119

ఉ. మాలల నంటుకొనిజనమాన్యులు, శుద్ధులు చేసి తెచ్చి భ
క్ష్యాలు భుజింపఁబెట్టి గుణగణ్యులు, మీకులమందు నేఁడు తే
రీలలి సంచరించు ఘనులెల్లరుఁ బంక్తికి నర్హులై పతుల్
గూలఁగఁ బెండ్లిచేసికొను కోమలు లెట్టు లనర్హ లౌదురో? 120

శా. ఆమూసూర్కుళ్ళు పండితుల్ గలుగఁగా! యందెందు విద్యార్థి తే
మీ! యేర్పాటుగ నుండిరే? యచట లేరే? దుష్కులున్ మాలలున్
నీ! యీ యెల్లర కందు వేదమయినన్ జెప్పంగఁ దా మొప్ప వి
ద్యాయత్తుల్ కులవంతులై విధవ పెండ్లాడన్ గులంబూడెనే! 121

ఉ. కావున నేను నీపిదప కాలమునందలి విప్రజాతిలోఁ
బావనురాలనై మెలఁగవచ్చును సంశయమేల? భార్యగా
నీవు పరిగ్రహించుటకు, నీతులు జాతులు నానకట్టుకున్
గావలెఁ బూర్వమం, దిపుడు గైకొనువా రెవ? రాప్రిచారముల్. 122

తే. గీ. ఎవరుపూర్వపుటాచారమెఱుఁగువారొ, వారలకుశాస్త్రము త్తరవాదియి చటఁ
దక్కువారల కీడౌ లిక కుల దెవ్వ, రేని నడిగిన నొరెత్త రిట్టులనిన. 123

ఉ. నావుడు నవ్వి "మాకొలమునం గల వైఖరు లిట్టులుండుటన్
నీ విటు లంటి తప్పిదమె! నీమము మాన్యత గాంచఁబట్టి యీ
యీవిధు లిట్టు లయ్యె నిదియే మన పూర్వపుఁగాలమైనచోఁ
బావనపుం గొలమ్ము లిము పాడయి యున్ బుధు లూరకుందురే? 124

మ. పరసంపాఁతిఁ బలిక్కతీవు జలవత్స న్యాయ మన్నట్లు ని
ష్ఠురమా జవ్వనయంపుఁ గాంతలకు నెట్టుల్ గూడు వైరాగ్య? మె
వ్వరికో జంకి యొకర్చు సేమములు నిల్వ న్నేర్చునే? జన్మమే
బరువై తోఁచెను భర్తలేనిసతికిన్, బైమాట లింకేటికిన్. 125

మ. పతిపోవన్ బలవద్గతిన్ సతిని దగ్ధ ర్తింగమందుంచి వే
చితి నంటించెదు ఘోరపుంగృతిని వాసిన్ గట్టిపెట్టించి రే
మతిమంతుల్, తగవార లిద్యబలలన్ "బాల్యమ్మునందే వివా
హితలం జేయఁగరా దటం" చనిన నీహీనస్థితుల్ తగ్గదిన్. 126

మ. "పదియేఁడుల్ చనుమీఁదఁ జేయఁదగు నాపై రెండు దాఁటంగ రా
దిదివో! స్త్రీలకుఁ బెండ్లికిం డటి" యటం చేర్పాటు గావించుచో
ముదికల్ వృద్ధులఁ బెండ్లియాడుటలు తప్పున్ దానిచేఁ దగ్గుఁ దోం
బదిపాళ్లీ మరుపదివం, బదియూ విద్వత్సమ్మతిన్ గాఁదగున్. 127

తే. గీ. ఈశువచ్చినకన్నియ నెవ్వఁడేని, వృద్ధునకు నమ్మఁజూప నెవ్విధిని పాగు!
నక్కటా! యెన్ని వృత్తులోయవనినుండఁ, బంద లీర్వృత్తికతన జీవనముగొందురి.

తే. గీ. అప్పుదీక్షితు లాకక్రప్పు డాత్మజాత, కిట్టి దురవస్థ గల్గఁ దానెఱుకకల్మి
స్త్రీపునఃపరిణయములు సేయఁబూని, యును వెనుకదీసెనఁటు తల్లియొప్పకునికి.

ఉ. అప్పటికాలమందు నెటులైనను నిప్పటివిప్రజాతికిన్
దప్పని దోఁచ దిప్పని, పృథాంతి వారలగోడు వోసికో
నొప్పుటకన్నఁ బండితుల కొండొకదోసము సేను పెక్కులా
తప్పుల కొప్పి యీయొకటి తాము సహింప రదేమి పాపమో! 130

తే. గీ. అరయఁగాలేక మిమును వెలయాడ్రిట బందురి గాని యీ యుగ్మమది నేఁటి కాలమందు
దిృశ్యమిడి పెండ్లియాడినధన్యతములు, భార్యలకు నెల్లఁ జెల్లఁగాఁ దగ్గఁగాదె.

ఉ. సాంకర్యమ్ము తటస్థమౌననుచు విశ్వస్త్రీవివాహమ్ము వి
ద్యాంసుల్ పెద్దలు గాదటం చనిరి సత్యంబే, యిదొక్కండె యీ
పంకంబున్ ఘటియించునో యిటు లనన్ బాగౌ దనంతన్ జగం
బింకం బాడెడిపట్ల నీనియమ మిందెవ్వాఁడు పాటించెడిన్. 132

ఉ. భూతి మొగమ్మునంగలుగ పుణ్యుఁడు పొద్దుట స్నానసంధ్యలన్
జేతముజొన్ప వైదికపుఁ జెయ్వులమానిని నూటి కొక్కఁడే
నీతఁడెఁ గానరాఁ డిపు డివేటికిఁ? బూర్వపుగాథ లేల? వి
ద్యాతిశయంబు మాని బుధు లందఱు దీనికి నొప్పరాదొకో. 133

శా. వ్యాసాదుల్ ఋషులై నిజమ్ము లయి తద్వాక్యాల్ భవిష్యద్గతిన్
బూసన్ గ్రుచ్చినరీతిఁ జెప్ప టది యున్ బోషండి యాచార! నీ
కే సారజ్ఞులు? వీరి కయ్యెడల తేనేలేదు విశ్వాస, మీ
యీ సత్యే సెటు లుండు? భ్రష్టులగువారే తన్మతోద్ధారకుల్. 134

గీ. అనుచు వాయాయిగోష్ఠి నతఁడు నదియుఁ, గొంతతడవు వాదమ్ము దమంతసల్పి
"మనకు నీగొడవేటికే? ఘనుల దీని, విందు" రని విరమించి పైవేడ్క దనర. 135

తే. గీ. తమకు ననుగుణమైన వర్తనలఁ గొంత, తడవుఁడపి యామీఁద నుదారుఁ డింటి
కరిగి ప్రతిదిన మీరీతి నతిరహస్య, మైనగతి దానిపొందు దా నందుచుండె. 136

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
జతుర్థాశ్వాసము.



# పాణిగృహీత

## పంచమాశ్వాసము.



స-రసాంతఃకరణాను
స్థిరగానాభరణ నిత్యచింతితభగవ
చ్చరణ కవితాదరణ సుక
చిర వితరణ కీర్తికామ సీతారామా.

తే. గీ. అవధరింపు మవంతరం బట్లు కొంత, కాలము రహస్యవర్తన గలుగుమీఁద
వారినోటను మఱియు నవ్వారినోటఁ, దల్లి యెల్లసంగతి విని తల్లడిల్లి. 2

మ. అకటా! పుట్టి రోగముకా, మొదటనే యంతమ్ము గావించి పు
త్రికు యోగ్యం బొనరించి నా నమునఁ జేతంబందు నూహించి యీ
సకలమ్ముల్ వెసఁ జేతికిచ్చితి నిసీ! చండాలుఁడై వీఁడు దు
ష్ప్రకృతిన్ మానఁడు సైఁచు టెట్టు లిఁక? నింటన్ వంటు లేవిప్పుడుల్. 3

తే. గీ. వేదశాస్త్రమ్ములందు నివేకులైన, రాజమణుల మెప్పించి మర్యాద మిగుల
నార్జనముచేసి రీయగ్రహారములను, బూర్వు లిది వీనికతమున బూడిఁగలియు. 4

వ. అని చింతించి యొక్కనాఁటి భోజనసమయమ్మున కొమరున కిట్లను.

శా. అన్నా! చిన్నతనమ్ము నుండియును సంధ్యావందనాసక్తి నీ
కెన్నంగాఁ గడునెక్కు డిప్పు డది తా నేమయ్యె? బ్రాహ్మణ్యపుం
జెన్నే నిన్విడుచున్న దేమిగతి? నీచెయ్యాల్ విడన్ గోత్రకై
నన్నున్ గాల్చుచున్న విట్టిపనులన్, న్యాయంబె? నీబోటికిన్. 5

చ. ఎఱిఁగియె నేకనో మొదట నేవపుఁగార్యము సొప్తి తీర్పవైఁ
జిరిగియు నుస్వెఁబొందితి సతీమణి యా కులకాంత యుండ నె
వ్వైతికము మాని యప్పటుపుటి తరిసి తతిగు తగొందువా?
సిరిగల కొంపకున్ గలిగెఁ జేటిఁక మాటలు వేయు నేటికిన్. 6

ఉ. ఎవ్వరిఁ బంపినా వదటి కిచ్చెనుముండము నై, తనంతఁ దా
నెవ్వఁడు వచ్చు? "నెమ్మొడల కెంపుల కేగవో?" యంచు నెంచితిన్
అవ్వగదా? దినమ్మునన రాత్రి చెయ్యలె? నీదు వర్తనల్
నవ్వరె? యెవ్వరేనియు, వినాయకుఁ జేసినఁ గోఁతి యయ్యెనే? 7

క. ఏమేమి నగలు నాణెము, లామాదిగ ముండ కిడితి? హా! రా! రా!
సీ! మూర్ఖ! నిన్ను నీవయి, నేమియొనర్చినను బాప మించుక గలదే? 8

క. అని యేమేమో యొదలుడి, కినగతి కనుగుణముగాఁగఁ గెరలి పలికినన్
దనుఁగాని యట్లువినియును, విననిగతిన్ జెవి నొకింత పెట్టక యతఁడున్. 9

ఆ. వె. భయమువీడి పట్టపగలును రేయును, దాని యింటనుంటఁ దక్కు నన్య
మించుకయును లేక యిల్లాలి మాటయే, తలఁపకున్నఁ దల్లి తల్లడిల్లి. 10

గీ. 'అంతకంతకు మొరడయ్యె నహహా! వీఁడు, భార్యఁ జూడఁడు వ్యవహారపంక్తిఁ గాంచఁ
డేమిగతి?' యని యొంచి తా నేమి యనక, తగినవారిచేఁ జెప్పింపఁ దలఁచె నపుడు. 11

చ. అరమరలేక యింటివ్యవహారము లన్నియుఁ జక్కఁబెట్టుమన్
జిరమునుండి స్త్రీయనుగ్రహాసీనుకు శాస్త్రుఁ డైవయోగ్యు నొ
క్కరుఁ గని "పుత్రు నీతిపరుఁగా నొనరింపు" మటన్న నాతఁ డు
ద్ధురమతి యొక్కనాఁ డతనితోఁ దగ మంతనమందు నిట్లనున్. 12

మ. కులవిధ్వంసకమైన కార్యము వివేకుల్ సేయఁగాఁ జోరుగా?
కులమన్నన్ గులమా? ద్విజాతి, యది చేజాఱన్ వశంబే? తమ
జ్జ్వలతన్ బ్రాగ్జనిభాగధేయమున సంపాదించి ప్రాయంపు దు
శ్చలముంబూని యధోగతిం బడు టిదే చందంబు? నీబోటికిన్. 13

ఉ. జన్మములన్ బొనర్చుటొ! విశాలయశమ్ము గణించుటో! సదా
మన్ననకెక్కు పండితుల మన్నటొ! చుట్టల నాదరించుటో!
విన్నఁదనమ్ము రాదె? సువివేకము పోదె? పురాకృతంపుభా
గ్యోన్నతి మన్నగాదె? యిటు లుంపుడుకత్తెలఁ గూడఁ బాడియే. 14

సీ. ముక్తికామినితోడ ముచ్చటించిరిగాని వెలవెలంతులఁ గాంచి కులుకరైరి
ఉపనిషత్కాంతల నంచుకొనిరిగాని పడుపుతొత్తుల యాసఁ బొఱలరైరి
సాహితీసతితోడ సరసమాడిరిగాని కులవిహీనలఁ జేరఁ దలఁపరైరి
కీర్తిభామినులకు మూర్తినిచ్చిరిగాని గుత్తలంజెలపొందు గోరరైరి;

తే. గీ. తరతరమ్ములనుండి యిందనక మీకొ, లమ్మవారలు నేఁటికీలలనకతనఁ
గోలుపు నీకు నవాచ్యమ్ములకు నొక్క, పెట్టఁ జెడఁదగినంత యిక్కట్టువచ్చె. 15

తే. గీ. ఇహమునం దట్టులుండ మీయింటిపూర్వు, లహహా! పరమున నేని వారాంగనాజ
నమ్మునకు సేవపడియె జన్మములు కోర్కె, యింతకయులేక చేయుట యీవు వినవె?

ఉ. వైదికజాతిలోఁ బొడమి వారనికల్మికి నెల్లవై యని
ర్వేదమనమ్ముతో నిటు వివేకము దక్కి కళత్రయావన
శ్రీ దిగులొందఁ బాడువెలచేడియ నంచెడి నిన్ను బోట్రికిన్
మాదిరిసేయ నీ భువనమండలి నొండొక డుండఁబోలు నే? 17

మ. తిరుగుంబోతులు లేరె? వారిఁ గనియున్ ధీనాఢ్యమే లేనిచో
నరుఁడెవ్వాఁడిల వారకామినుల సౌందర్యమ్ము నాసించు? నీ
మరియా దెట్టిది? నేఁటి నీనడత కేమాన్యుండు లోఁగుండఁ? డో
ప్పరికింపందగు నే? కనుంగొనుచు మీపాత్రిపందు మాబోఁట్లకున్. 18

శా. దారిద్ర్యమ్ము జనించు, మై సిరి వృథా దైన్యమ్ముపాలౌ. సదా
చారం బాఱడి యౌ, యశమ్ము మొదలే సన్న్యాసముం గాంచు,సం
సారం బగ్గని వ్రగ్గు, నెల్లెడల నిస్సారత్వమే తోఁచు, నీ
వారస్త్రీ సురతప్రశంస దగు నే? వర్ధిల్లు సంసారికిన్. 19

క. అని యేమేమో తా నే, ర్చిన విధమున బోధసేయఁ జెవిసిడక యతం
డనయము ననయంపుఁగావ, ర్తన మానఁడ, విటులమనము తరమే? త్రిప్పన్. 20

వ. ఇట్లు పలువురు సెప్పందొడఁగుటయు.

మ. ఇదిగాదంచు మనమ్ముకం దలఁచి యయ్యేణాక్షితోఁ "గార్యమి
ట్టిది" యంచున్ దగఁదెల్పి "మంచి" దనుచున్ డెందమ్ము వొంగార నొ
క్కదినం బాపురి వీడి యిర్వురును దుర్గాపట్టణం బేగుదెం
చి దిగుల్ దక్కి యటన్ వసించిరి ఘనశ్రీ మించు సౌధమ్మునన్. 21

ఉ. ఆపురి వీరిపూర్వులకు నాకరమాటను దండ్రి యచ్చోటన్
గాఁపుర మాచరింపఁ దగఁ గట్టెను సౌధము, దానిలోనఁ దా
నీపురుషోత్తముండు వెలయించి నొకర్తుక నంచెఁ జచ్చెఁ గా
కా పురుషుండు సైఁపఁగలఁడా? యిది దాఁ గనలారఁ గాంచియున్. 22

ఉ. జ్ఞాతులుఁ దక్కు బందుగులుఁ గాంచి "యహా! యిది యేమివింత? దు
ర్నీతి సహింపఁగా వశమె? నేరుపుమై మఁరలింత" మంచుఁ బో

నాతఁడు వారి వచ్చుటకె యాజ్ఞనొసంగఁడు లజ్జ పుట్టదు
న్నె? తగు బంధువర్గ "మిహిహీ!" యని యగ్రమునంద నవ్వినన్. 23

ఉ. నవ్వుదు రెల్లవా రని మనమ్మునఁ దా నెఱుఁగండొ? యెక్కడా
అవ్వకు నాకరంబగుట ప్రాజ్ఞతమం దగదం చెఱుంగఁడో?
యవ్వపుఁగాక భార్యకును నంతరమున్నె పరుండు నై బుధుల్
ప్రివ్వఁ బెట్టు దుశ్చరిత రోయని యాయన నేమనన్ దగున్. 24

శా. ఆనీటున్ వెనుకుంబొజుంగు భవనమ్ము దెల్లెడన్ గాయనీ
గానానూన రసమ్ములా! యభినయత్కాంతా వినోదమ్ములా!
నానాశాస్త్రగమ చర్చలా! మిగుల మెచ్చంగల్గఁగాఁజేయు లా
స్యాంగానుభవమ్ములా! యొలయు నీయావేళ నా కెప్పుడున్. 25

ఉ. అట్టుఁగనిమ్ము తల్లి, సుదతీమణి భోజన సేద్వనిమ్ము, బల్
అట్టు జనింపనిమ్ము, ధనరాసులు గవ్వలుగాక చెల్లని,
మ్మట్టి యఖండ సౌఖ్యముల నందుచుఁ గష్టమెఱుంగనట్టి యా
పుట్టువుకన్న మిన్నయగు ముక్తి విరక్తి యొసంగ నేర్చునే? 26

శా. ఇచ్చున్ వద్దెలకిగ్గవారలకుఁ, దా నిచ్చున్ దగన్ బాడుచోఁ
బొచ్చెంబింతయు లేనిస్నేహితులకున్ బూఁబోండ్లకో యిచ్చు రా
నిచ్చున్ బంక్తికి నెంతమంది నయినన్, వీక్షింపఁ డావంత యే
నిచ్చున్ "ఖర్చిది యాయమింత" యని, వాఁ డేమింకఁ గానుండెనో? 27

ఉ. తల్లికిఁ జిక్కు దిక్క మది దక్క సమస్తము నాలుగేండ్లలో
డొల్లఁగఁజేసి యాపయిఁ గడున్ విలువై తగు నగ్రహారమున్
బల్లెలనిస్తు చాల కవి బంధకముంచి ఋణమ్ముఁజేసి తాఁ
జెల్లఁగఁజేయుఁ బల్వగలఁ జేతికి నెమ్మొక యింత యుండమిన్. 28

తే. గీ. తనమపంక్తిని నన్నసత్రమ్ము జరుగఁ, గామసత్రమ్ము గణికలకడఁ జెలంగ
నయ్యువారునిఁ గొల్చుచు నెయ్యురెంద, అందఱో సోమరులు వొల్తు రెసక మెసఁగ. 29

ఉ. గాయన గాయనీమణు లొకానొక వేళను బాయకుండుటన్
జేయని చేరికై యతని చేతికి వాటవెలందివో లెఁ దా
వోయిగ జంత్రిపు గల యొయ్యార మెసంగఁ బోసంగి లోంగె నా
తీయఁదనంబు మెచ్చవెనుదీయక గాయకుఁ డిట్టిఁ జేసెనున్. 30

తే. గీ. గాయకుఁడు వచ్చెనేని యక్కలికిఁ దాను, శిష్యభావమ్ము గైకొని చెలిమికలిమి
దానఁ గలుగు విశేషముల్ తగినకోలఁది, నార్జనముచేసి కాని యయ్యనఘు విడదు 31

శా. దాతృత్వమ్మున మించియుం జిగుల విద్యాసక్తి రాణించియున్
మాతృద్వేషము దారదూరగతియున్ మాన్యేతరుంగా నప
ఖ్యాతుంగాఁ దనఁ జేయ నాతఁ డది లోఁగాంచంగ లేకెప్డు తీ
లాతాత్పర్య పరీతుఁడై కడపుఁ గాలంబెల్ల హేలాగతిన్. 32

క. ఆకలికి వస్త్రసంబడి, లోకుల కొకరీతినైన, లోనతనికిఁ ద
ద్వ్యాకులచిత్తుఁడగుట న్యావా కలిగించి "యది భార్యయగు" ననిపించెన్. 33

తే. గీ. "వీనితో నవ్వె మొన్న నవ్వానితోడ, నొక్కచేతయ్యెఁ గూర్చుండె నూరకుంట
తగవె?"యని యెవ్వరేనియుఁ దనకుఁ జెప్ప, వినఁడు వినెనేని నమ్మఁడవ్విధము నంత.

తే. గీ. గాఁగరా గట్టుమాని యఖండనీతి, శాకరంబగు కులకాంత యట్లు నవ్వె
లంది వేషభాషాదుల నంది పైకి, సంచరించుఁ గులాచార సరణి విడిగి. 34

మ. ధనమందిచ్చను గాదుగాని యల కాంతారత్న మప్డప్డు నా
ఘనిఁ జూడన్ గవిగాయకుల్ చనుడు నందున్ వచ్చువానిన్ దనం
తన యేవేళనొ వశ్యుఁ జేసికొని విత్తంబిచ్చు భర్తన్ జయిం
పనొకో నాగను జిత్తమిచ్చి కడు సంభావించు గూఢస్థితిన్. 35

ఉ. ఆచెలి కేమిపాపమొకొ హాయిగఁ బాడెడి వానికన్ననున్
వాచవిగాఁ గవిత్వ మొక వైఖరి నింత రచించు వానిపైఁ
బూము మనంబు, తాదృశుని పొందునకై మది నూరుచుండు నా
లోచనసేయుఁ దన్మయత లోలవిలోచన సారెసారెకున్. 37

తే. గీ. రాజు సంతసమందిన గ్రామమిచ్చుఁ, బద్దమిడుఁ గవి బచ్చు దావైచు ముష్టి
యెవనిమెచ్చునో కాంత యయ్యోమ్మెకాని, కతనుపట్టాభిషేకమ్ము నాచరించు. 38

ఉ. ఈగతి నప్పుడప్డు ప్రియుఁ డెవ్వరి మన్ననసేయుచుండుఁ దా
నాగజయాన వారికె యాత్మసతీత్వము వెల్లడించు నా
బాగదియెల్ల నెల్లరిగఁ బై వినువారలు నవ్వుచుందురిహో!
భోగము దాని నంచుకొనఁబోలునె? యెంతటి పందకేనియున్. 39

ఉ. పోయినఁ బోవుఁగాక వెలబోటిపయిన్ మరులూని యెన్నఁడే
నీ యది యింతగాఁ దనవు నెగ్గు ఘటింపదుగాని యొక్కతె
"క్నా" యని యుంచుకొన్న వెతి నాయకన్నను హీనుఁ డున్నె? యే
జాయి సహింపనేర్చు నది జంపు లొనర్చి యుమర్చు నేవకుల్. 40

మ. వ్యభిచారంబన వారకామినుల కావంతేని లజ్జాకరం
బభిమానఘ్నము నంచుఁ దోఁప "నది గోప్యంబేల? గావింతు" ర
న్నా! "భృతిన్ దెచ్చియొసంగు నాథుఁ డదిఎన్నన్ జీవనంబూను" నం
చు భయానన్, గులకాంతరీతు లెటువచ్చున్? వాండ్రు నెట్లుంచినన్. 41

చ. సరసతగల్గువాఁడు గడుసంపద వొల్చెడివాఁడు నూతన
స్మరుఁడన నొప్పువాఁడు మదమత్తుఁడు నా విటుఁ డబ్బినన్ దరి
ద్రిరతికి నాస చేయునఁట తా వెలయా, లిది స్త్రీలజాతికే
పరిచితి గన్నదోస మొకబానిసలన్ వెలిఁజేయు నేటికిన్. 42

మ. "ధనమేలా? సొగసేల? చక్కనికవిత్వం బెవ్వఁడే నేర్చు వా
నిని మెచ్చన్ దగు, మాటలాడఁ దగు వానిన్ బిల్చి, యవ్వానికిన్
జనవీయన్ దగు, వానితోడ విధిగా సఖ్యంబు గూర్పన్ దగున్
వనితాచిత్తహరుండు వాఁ" డనుచు నవ్యాయుక్తి లోనెంచెడిన్. 43

ఉ. ఏగతినైన మేటి సుకవీంద్రునిఁ గొల్చి కవిత్వ మల్లు నా
యాగతిఁ జక్కనేర్చికొను నాస దినమ్మును వృద్ధిఁబొంద నా
భోగము చాన పూనికమెయిఁ బొత్తములెల్లను జూచుచుండు నా
లోఁ గననయ్యె శాస్త్రములలోలఁ లోచనలన్ గవిత్వముల్. 44

తే. గీ. రాధికాసాంత్వనమ్మను రచనఁ జేసి, పేరుగనుముద్దుపళని తెల్వియును విజయ
నగరభూపాలుఁ డుంచిన నాతిచాటు, పద్యములు గాంచి యాకీర్తి వడయ నెంచి. 45

మ. ప్రియునిన్ గాంచి కవిత్వపుం గరిమయున్ వేళ్ళ నోశ్లాఘించి త
ద్దయుఁ నావిద్దియయందు నెమ్మనము శ్రద్ధాబద్ధమై యుంటఁ జె
ప్పియు "వారిం బిలిపించి నాకు నది చెప్పింపన్ వలె" న్నాఁగ నా
దయితుం డాప్రియురాలి కిట్టులను విద్యావిత్త్వ మొప్పారఁగన్. 46

మ. కవనంబన్నను మాటలా? యదియుఁ జక్కన్ జెప్ప శాస్త్రాదికం
బవలోకింపవలెన్ బురాకృతపుఁ బుణ్యంబున్న పైఁగాని యా

చవి శాస్త్రజ్ఞులకేనిఁ గల్గ దది యాసక్తిఁ బొందఁగాఁ బోకు మే
వివరింపంగలవా! యతిక్షితి గలుగు వాదభేదమ్ములెల్లన్ జెలీ. 47

సీ. చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్ములు వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజమాడామణులసభల్ పొందఁగావలె మహాభోగములను
దిరుగఁగావలె దేశదేశాలవెంబడిఁ బడవలెఁ బడరానిపాటులెల్ల
వినఁగావలెను పూర్వవిద్వచ్చరిత్రముల్ దర్శింపవలెను ఛందఃపరిశీలింప

తే. గీ. కవులు కవులన్నమాత్రాన కవులు గారు; ఎంతభారమ్ము గలదో కవీశ్వరులకుఁ
దెలిసికొంటివె? యిన్ని విద్దెలను నెల్ల, ఫలము దేనికి యత్నించుము తలఁతియగునె.

క. అన నదియిట్లను "నంతటి, ఘనమగు కష్టమ్ము దానఁ గలదేనియు నె
క్కొని యిపుడు కవితఁ జెప్పెడి, జనులకు మీ చెప్పినట్టి శక్తులు కలవే? 49

తే. గీ. దేవభాషాకవిత్వవిధికి విశేష, శాస్త్రవిజ్ఞాన మది యవసరముగాని
దేశభాషాకవిత్వవిధికి నిదేల? యెఱుఁగ నని చెప్పుటో? నాకు నిదియు నెల్ల. 50

చ. మునుపటి నాటకమ్ములును మున్నటి మేటిప్రబంధముల్ తెనుం
గొనరుచు నేఁటి కైపసుల కున్నవె? శాస్త్రపరిశ్రమమ్ముల
య్యనఘుల సత్ప్రబంధముల నందఱు మెచ్చుటలేదె? ధారయుం
డినయెడఁ జెప్పవొప్పగుఁ గడిందిగఁ గబ్బము లెవ్వరేనియున్. 51

ఉ. నావుఁడు నాతఁ డిట్టులను నాతిరొ? నన్నయభట్టుఁ డాది వి
ద్యావిదులెల్ల నాంధ్రమున యందుఁ గవిత్వము చెప్పి రౌఁగదా!
యా విదితాత్మలొక్క తెలుఁగా? తమ రభ్యసనం బొనర్చి, యా
దేవవచఃకలాపములు తెల్లము సేయవె? వారి పాండితిన్. 52

గీ. తెలుఁగు తెలుఁగని యద్దాన దిగఁబెకాని, సంస్కృతమ్మునకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁ, జాలు దాని, కిద్దానికో! రెండుఁ దగులవలయు.

ఉ. ఇప్పటి కైతగాం డ్రహహా! యి గిలిపి సాకయింత నేర్చి, పై
జెప్పెద రాంధ్రపుం గయిత, సీ! యవి పండితు లాదరింతురే?
తప్పులతప్ప లక్కృతులు తంపటవెట్టుట కేనిఁ బూర్వమం
దొప్పిరె? వీరిఁ జూచి యొకో? యూరక నీకుఁ జనించె వేఁదుఖుల్. 54

న్నది!" యంచుఁ బుత్రికఁ బాండితీగరిమ నాయాయావిశేషమ్ములన్
గదలింపన్ వెఱఁగంది యక్కవి రిక్తత్వమ్ము సూచించుచున్. 73

ఉ. స్కూలున నింగిలీషు నొక కొంత పఠించితిఁ దెల్గు దానితో
లీలఁ నభ్యసించితిని లేమిమెయిన్ బయిచదువు సాగమిన్
జాల విచారమంది వెస ఛంద మొకించుక చూచి గానపుం
జాలది పూర్వమే కలిగి సాయ మొనర్పఁగఁ గతల్ రచించితిన్. 74

చ. హరికథ లల్లుచున్ గ్రహము నందలి రిక్తత వాపికొంచు నేఁ
దిరిగెద దేశముల్, తగు సుధీమణి శిక్ష యొకింత లేమి సు
స్థిరగతిగాఁ గవిత్వ మది చెప్పఁగఁజాలఁ గటాక్షమూఁచి మ
త్పరిచితమైన యట్టికతఁ బాడఁగ నాజ్ఞ యొసంగ వేఁడెదన్. 75

చ. అన జలజాక్షిఁ గాంచి "చెలియా! కనఁగొంటివె యీతనిన్? కుటుం
బవియుతుఁడై ధనాఢ్యులను వంచనసేయఁ గవిత్వమంచుఁ దా
గొని వెలిమెత్తు పద్యములు కొన్ని రచింపఁగఁ జొచ్చె నేను జె
ప్పినయది యెల్ల సత్యమనిపించుట కీతని రాక యుగ్మలీ! 76

తే. గీ. ఎందులోఁ జేరకుండెడి హీనులెల్లఁ, గవులలోపల నిమ్మెడఁ గలియుచుండ్రి
ఎల్ల వర్ణమ్ములును గూడి యుండుకంత, యంతరము లేక తురకలయందుఁ గలియు.

ఆ. వె. ఇంగిలీషు చదివి యీకవిత్వము సెప్ప, నేల? దానఁ జెప్పనేల? రాదు
ఉభయభ్రష్టు లిట్టులొనరింతు రీనాఁటఁ, గవుల కింక నేటి గౌరవంబు? 77

చ. అన సదయాంతరంగయయి యచ్చెలి పల్కు విశేష పాండితిన్
గను కవిచంద్రు లెక్కురణిగాఁ జను దెంతురె? యెల్లచోట్ల కి
య్యానఘుని వాక్యమాధురి సహస్రము సేయఁగఁ జాలు మీరు న
చ్చిన కవి కాకపోయినను జెప్పఁగ నేర్చుఁ గవిత్వ మొప్పగన్. 78

చ. చదివెడి శైలి గానపుఁబసం దలరారుటఁ జేసి చక్కఁగా
మదికి ముదంబొసంగఁదగు మంజులమైన పదమ్ము లుంటచేఁ
బొదలు రసంబు, నేరుపును బొల్చెడిఁ దప్పులకేమి? రక్తిసం
పద నడఁగింప నేర్చునె? చమత్కృతిమత్కృతియందు దోసముల్. 79

తే. గీ. దోసముల్ గల్గుఁగాక నిర్దోషమయ్యెఁగుఁ, గాక రసహీనకృతికన్న ఘనరసాఢ్య
దంబగు కవిత్వమెంతొ ముదంబొసంగు, నంకయుతుఁడయ్యు జాబిల్లి హాయినిచ్చు.

శా. ఆమాటల్ విని యయ్యుదారుఁడును దా నంగీకృతిం బూని న
ర్మామాత్యాదులలోనఁ జేర్చికొని యాయావేళఁ బాడింప చే
మేమో యల్లిక లల్లఁజేయుచును నాయేణాక్షియుం దాను ని
త్యామోదమ్మునఁ గాలముం గడపుచున్నంతన్ దుదిన్ వానికిన్. 72

చ. ఎరు పొకయింత లేక చరియించుటచే నలకాంతపై మనం
బరిగి యదెంత దిరిప్పినను నట్టిటు తాఁ జలియింపదయ్యె న
త్తరుణికి నంతరున్ మును పెఁ దన్మయమయ్యె మనోవికార, మా
యిరువుర లోపమేమి? యట నీతనిదే యపరాధ మెమ్మెయిన్. 83

శా. దానిన్ భార్యగ నంచుకొన్న యతఁ డంతస్స్థాపితన్ జేసి క
వ్వానిన్ వీనిని గోప్యమం చెఱుఁగ కవ్వామాక్షి కేళీగృహం
బేనిన్ జేర్చునె? యిట్టులైన నది గాదే? సత్సతీరత్నమున్
మానం బూడ్వదె? నిత్యసంగ మది యున్మాదంబు గల్పింపదే? 85

ఉ. "స్త్రీలకు గోప్యతాగరిమ చెప్పినవారలు పెద్దు" లంచు మూ
ర్ఖాళి వచింతు రిప్పు డిటు లంగనలన్ సభ కెక్కనిచ్చి యా
మూలమునన్ జెడన్ మొగము మూసుక మిన్నక లోనఁ గుందు జ్ఞా
నాలసు లెందఱో యిల స్వయంరచితాగసు లండి రక్కటా. 85

క. మును పూర్వులెంత యనుభవ, మునఁ జేసిరొ? కట్టుఁబాటు మూర్ఖులు దానిన్
గననేరక యిహీహీ! యనఁ, జనునే? తమకంతకన్న శక్తులు కలవే? 86

మ. కలుదారిన్ జన దంచుఁ జెప్పుటకునై కల్పించు నాచెట్టు వా
రలుగూడన్ గలవమ్మ లంచుఁ దమవాక్కుల్ శాస్త్రముల్ గా జగం
బులకున్ బోధ యొనర్చినట్టి సుమహాత్ముల్ కడు కైలాసమా
ఖులలన్ బోలఁగఁ జాలరో? వశ మొకో ఖండింప నక్కట్టులన్. 87

తే. గీ. తమరు విధిలేక చేసెడి తప్పులన్ని, కడుపున కటం చెఱుంగరే ఘనులు, వాని
నొప్పులని చెప్పనొప్పుట యొక్కతప్పు, పూర్వులను దూఱుటదియుఁ దప్పుపయితప్పు.

తే. గీ. స్త్రీకి స్వాతంత్ర్యముండుట చెల్లదంచుఁ, జెప్పుమను వంత వెఱ్ఱిరే! చెడికొలమ్మ
నెల్ల గంగను గల్పదే! యెఱుఁగనేర, కూరకయ శాస్త్రకర్తల మీఱనగునె! 89

ఉ. భోగము దాని కింత తలపోయఁగ నేటికిఁ? గుక్క గోవునుం
గాఁగ నొనర్ప శక్యమె? యగాధము లేగతి నంచె నేనియున్

స్త్రీగతు, లందులోఁ గఱకు చేయనివాఁడు ధవుండు గల్గఁ దా
యోగిని వంటిదైనఁ గను నొక్క క్షణమ్మున భోగినీగతిన్. 90

ఉ. ఆగతి నిర్వ్యథన్ మఱని కగ్గలమై మనమంద మ్రగ్గుచున్
సాగమిఁ బొక్కి "యించుకయు సందగునే?" యని దేవు వేఁడుచున్
రాగమె రోగమై తగఁ గరమ్ము నలందుకుచుండి రంతలో
నాగజయాన సాహసము నందె కృతార్థునిఁ జేసె నాతనిన్ 91

క. సామాన్యయయ్యుఁ బరకీయామాన్యతఁ గాంచి వాని సహామో నిశయో
యేమూలనో చరితార్థుఁ, గా మన్ననసేయు నతని కనుఁబ్రామి యొగిన్. 92

ఉ. నాయకు పక్కలో నిమిడి నాతి యెటుల్ కనిపెట్టునో యతం
డాయతమైన నిద్రగను నయ్యెడ మెల్లనలేచి "రాదుగా?
ప్రేయసి" యందు లో నొగులు ప్రేముడికాని యుసుమ్ము చేరు నా
మాయాలమారి, యయ్యతివ మానస మేమిట ధాత చేసెనో? 93

ఉ. రూపవిహీనుఁ డన్యుఁడు రూపసి, చీఁకటి వెల్గు, స్థండిలం
బే పఱు, పూరకు డుటయె యింపగు పక్కలు, ధూళి గంధ, మే
చాపయు నేని దుప్పటిగఁ జాన కృతార్థతఁ జెందు నేవతుల్
దాఁప వొకించుకేనియును దొయ్యలికిన్ బ్రియుఁ డబ్బపట్టునన్. 94

మ. తనకై భార్యఁ బరిత్యజించెనఁట మాతన్ వీడి యవ్వాసమై
నను గాదంచును రోసెనంట యొకఁడై జ్ఞాత్యాదిబంధువ్రజం
బునకున్ దూరగుఁడై వెలింబడిన చొప్పున్ గాంచె నం టట్టివా
నిని దా నిట్టులొనర్ప న్యాయమగునే? నీచాత్మ కాకుండినన్. 95

ఉ. ఆతనియందుఁ బ్రేమ మొదలంట నశించియె? కాదు; లేక దు
ర్వ్యాతిగమైన చిత్తమున నాశ జనించియె? కాదు; రూపసం
ప్రీతియె? కాదు; కొండొక కవిత్వ మదింతకుఁ దార్చునొక్కొ? దు
ర్జాతికిఁ గల్గు చంద మనరాదె? వికల్పము లిన్ని యేటికిన్. 96

మ. మగనిన్ రూపమునన్ ధనమ్మునను సమ్మానాతిరేకమ్మునన్
దగు విద్యత్తను దక్కు భంగులను మందప్రజ్ఞఁ గాఁ జేయు మేల్
సుగుణుల్ లేకయె యొక్కరీతి మెయి నించుక్ మించు గాకుండ మే
టిగుఱిన్ గొల్చునె? సాధ్వి, మానవతు లీకీవుల్ పరికింతురే? 97

ఉ. "పేఁడగు పీఁడు గాఁడునికి వేఱొకఁడా" యను నట్టి బుద్ధిఁ దూఁ
గాడెడి యందకత్తెఁ గొని యంతటఁ బోవక పంజరంబునన్
గ్రిక్కఁగ గాక సుందరగతి గేహమునం దిడ గేహినీగతుల్
పాడుకొలమ్ముకొమ్మలకుఁ బట్టునె! పైపయి నవ్వి యున్నవే? 98

మ. తనకున్ బ్రొద్దుట లేచుటాదిగ నిశీథంబైన యందాఁక న
మ్మను చిన్నమ్మలఁ బెద్దయమ్మలను బై మాతృష్వసృస్తోమమున్
దనతోఁబుట్టువులన్ మరల్ గొలిపి విత్తమ్మిచ్చి భోగించు దు
ర్జనులన్ బట్టినదాది చూచు చెలికిన్ సాధ్వీత్వ మెట్లబ్బునో? 99

ఉ. ఉంచికొనంగ నేల? వెల యూడిగపుం జెలులన్ జరుల్ సయో
దంచితమైన వర్తనఁ దార్పఁగ నేల? పయిన్ దదన్యథా
భ్యంచనలైన వారలకు నల్గఁగ నేల? కటా! భుజంగులన్
వంచనఁ జేసె ధాత, యొకపాటివివేకము గల్గఁజేయమిన్. 100

ఉ. ఆచెలి వానిఁ గూడి యిటు లాఱడిపోకలు వోవుచున్ బ్రియా
గోచరమైన ఫక్కి నటు కొన్ని దినమ్ములు పుచ్చె నంత నా
యీ చతురత్వమెల్లఁ దరి నెయ్యెడలన్ వసియించు నెయ్యురే
చూచి క్రమమ్ముగా "నిజము సు"మ్మది యంచుఁ దలంచి యొండొరుల్. 101

చ. కలసి యొకానొకప్డు "డిది గా దది యూ" నని చర్చఁ జేసి "యీ
తులువ కిదేమి మూఁడెనొకొ? తోఁచదు శుద్ధచరిత్రిఁ డిక్కృతుల్
తెలిసినఁ గోపదారి వెదదీయునె? చంపుట కాతఁ డక్కటా!
కలిగనొకో? దురాత్మునకుఁ గాలము దగ్గతి యిట్టి దుర్మతుల్. 102

ఉ. విప్రులలో జనించియును వీరుఁ డితండు దుపాయులన్ గటా
ర్లప్రతిమానముల్ గృహముసం దెపుడున్ గనుమాయసీయుఁ డా
ర్త్రిప్రదమంచు నెంచక వారిన్ బోరి వేఁటకు నేగి కాన జం
తుప్రకరమ్ముఁ జంపుమన దుండగుఁ డిప్పళువున్ సహించునే! 103

చ. అనవుడు వేఱొకం డను "నహో! యతఁ డేమి యొనర్చునట్టి చ
క్కనివిటుఁ దబ్బి సర్వవిధకామములన్ దన కున్న యప్పుడే
మని యిది గోరఁగావలయు నా యధమున్? వరియించినప్డు కా
దని వెనఁద్రోయువారు గలరా? యిది యూతని దోస మెట్లగున్? 104

తే. గీ. అక్కటా! లేక భాగ్యరేఖ దానట్టిదగుట, వెలికి రాకుండెఁ గాని యీ వెలితనపుఁ
బోఁడ యిటువంటి యతిథులఁ గూడ దింతఁ గొంద ఱెందతి నిదిమన కేటికొఱ్త?

చ. ఇది బయలెక్కెనే నిజమగునేనియు నాతనిఁ జంపనేల? య
ట్లదిత కథింపు టొప్పగును, మూర్ఖుఁడు గానియెడన్ వివేకసం
పదకలిమిన్ జెలిన్ గృహము పాయఁగఁజేయుటె మేటితెల్వి, యొ
క్క దినకమానునే? తనదు గ్రాసము లేకుఖ మిచ్చి పెంచినన్. 106

చ. అనుకొన రాదుగాని మన మీతని ద్రవ్యముఁ దిన్నచుండి, యే
మని వరియించె నంతకె సహాస్త్రియు చూచినయివ్వేలంది? నే
మని గతి వీడి యీతులుడ కబ్బురపుం జనవిచ్చె? వీని ని
వ్వాలిత యదెట్లు చేసినను వహ్వారె! మెచ్చఁగవచ్చు నెమ్మెయిన్. 107

సీ. తను దత్తుఁగాఁ గయికొనినతల్లి "హులోపాలో" యటంచును దుఃఖమొందుచుండ
తనకుఁ గన్నియ నిచ్చు ననఘులౌ న త్తమామలు లోన మలమల మఱుఁగుచుండ
తనుఁ గట్టికొన్న యా యత్తమ రాలు భార్య సంతతధారావృష్టి నేత్రములఁ గురియ
తనయపత్యపు టాసఁ దలక్రిందుగా వ్రేలు పితరులెల్ల నిరాశఁ బెట్టు దిట్ట

తే. గీ. నెందుకీ ముదితొత్తుతో నిటుకు నటుకు, గాలిఁ దిరుగాడునొకయూఁగాక సారెఁ
బయనములొనర్చుచును దనవైనచక్రగుఱు తెఱుఁగనివీనిఁ బేర్కొనఁగవలయు?

ఉ. మానవులెన్న? పూవులును మాళకుఖం దగు తోఁటలెన్న? పై
నీడువచింపరాఁ దగని వెన్ని సిరుల్? తన కేమివచ్చెన
వ్వీడు విడన్? విడెన్ సరియె వెక్కటి యూత్మపురమ్ము జేసుటన్
బూడిద! యేటికిప్పురినిఁ బోవలె వర్ధన వద్దె కొంపలన్. 109

శా. ఆప్పాల్ సేయుటతప్ప వే తెఱుఁగఁ డీయార్యేతరుం డెల్లరన్
బప్పు గూడగ మిగ్రుగుమండి రిపు డిప్పాపాత్ముఁ రాలెట్టులేన్
దప్పుం గాక యదృష్టమే యిదియు నీతం డింతలోనైనఁ దా
విప్పున్ నేత్రము, లున్నమట్టుగయినన్ వీక్షించి రక్షించెడిన్. 110

చ. అన నతియోక్కఁడిట్టులను "నాతని కెవ్వ తెఱుఁగఁ జెప్పు వా
ర్లైనఁ డెవరెన్న చెప్పినను వీడేఁడి, యంతటఁ బోక చెప్పు వా
నినె వెలిఁజేయు నయ్యతిడ నేకప దెట్టినొ? యింత పెంకె వా
నిఁ దన దాసుఁ జేసికొని నిక్కడి నిగ్గెడి కట్టివీఁగడిన్. 111

ఉ. ఎన్నాళ్లని నేని లెక్కయిడ దెంతటి వానికి నేని మ్రొక్క దీ
కొన్ని వ్యయంబు పోవలెన్ మనను గోరిక దీఱఁగ నంచు నెంతొ నేఁ
డిన్నిగఁ జేసుకొంటి నగిదే యిది యైన మఱేమి లాభమా?
పన్నుగఁ గుంభ బోజుఁ గిది యర్థ్య మటంచుఁ దలంపఁ డింతయున్. 112

చ. అన మఱియొక్కఁ డిట్టులను "నా చెలి కోలికిఁ బోవ నేల? యా
యనఘుఁడు దానికిన్ గలసె నాకిఁకఁ దప్పు లొనర్పఁగాక యా
తని కవి యొప్పు లేయగు వృథా మనకేటికిఁ గంఠశోష! యే
మని "తగువార" మంచు నిది యాతనితో వచియింప నేఁటికో!". 113

క. ఆదివేశ్య, యితఁడు విటుఁడి, య్యాది తప్పెట్టులగు? భార్య లైనవనితలే
వదలంగ నేర రీదు, ర్మద వృం జైనముల, నొరులమా టేమిటికిన్. 114

క. మన మేల నిమిత్తశ్యము, గనవలయున్ వీఁ పాపగతి దాఁగదు వైఁ
జనుఁ దనయంతన యది య, య్యనువునఁ దోప్పడఁగ రాదె? యంచు బలసిన్.

క. "ఏకత్తున నిప్పాడిన, నాకత్తున కాలు" నన్య మనవసరం బీ
పోకలు తగు యోగ్యులకున్, వాఁపుఁ ద్రవ్వఁగ రాని, వింత వంతేమిటికిన్.

క. అని మిన్నకుండి రంతటఁ, జని యొకఁ మఱి కొన్ని నాళ్ళు, చయ్యన నక్కా
మినికి వినాశన కాల, మ్మున మూఁడెన్ తెలివో కుబుద్ధి వోడమదే!

వ. ఇట్లు దినదినమ్మును గోరిక లీరికలెత్త న త్తలోదరి చిత్తమ్మున నుత్తలపాటు దక్కి యక్కుకవి యక్కువకెక్కుచు మక్కువఁ దక్కుచు సొక్కుచు నున్నంత నొక్క నాఁటి రేయి యథాపూర్వమ్ముగ గానాదివినోదమ్ములఁ గాలహరణం బొనరించి నిశీథమ్ము కటయును. 118

చ. తన దయితుండుఁ దాను మఱిఁ దక్కిన నెయ్యురఁ గొత్త భర్తయున్
బెనుగది సందునం దిమిడి వేఱు శయ్యలఁ బవ్వళించి యాం
డిన వపు దెప్మెకానిపయి డొంపము వాఱుపు సాహసించి "యీ
జను లెవరేఁ గందు" రని చాన మదిన్ దలపోయ కొప్పుగన్. 119

శా. అందెల్ చప్పుడుసేయకుండుగతి నొయ్యారమ్ముగా లేచి దీ
ప్తిం దెల్పాఁ దెడిపిపయాస్పు గుఱిచేఁ బ్రేమాస్పదుం జూచి "వ
చ్చెం దన్వంగి" యటంచు మేల్కనిన యా చోరప్రియున్ జేరి యా
నందింపన్ దొడఁగెన్ దపీయ మగఁ డెంతం గౌఁత పాషాణమో 120

ఉ. ఆలలి నెల్లఁ దాఁ గని యువారుని స్యాలకుఁ డొక్కయేనియున్
బాలకుఁ డయ్యు లోనఁ “దన బావకు నప్పుడు దూఱ మాటలున్
మూల మిదే” యటంచు దలపోసి “యి దేఁటిసైఁ బోయినన్
మేలగు నప్ప” కంచు మతి మీఱిన తోషముఁ బొందుచున్ దగన్. 121

ఉ. అల్లన లేచి దీపము గృహమ్మున వెల్గఁగఁ జేయునంత నా
పాల్లకపాణి మున్నె తనదౌ శయనీయముఁ జేరి “యింక నే
కల్ల వచించినన్ వలయుఁగు గాదిది వీనికి స్పష్టమౌను వీఁ
డల్లరిసేయుఁ” డంచు మది నల్లలనాడి దిటమ్ము గాంచియున్. 122

వ. ఉపాయమ్మునప్పిల్లవానిఁ బిలిచి మంతన మ్మగు నెవయం దీసికొనిపోయి వెలవెలం
బోవుచు దీనమ్మగు చందమ్మున మెల్లన నిట్లను. 123

ఉ. తమ్ముఁడ! నన్ను నప్పగ నెదం దలపోయుదు వేమి నట్టి చం
దమ్మున నిన్నుఁ జూతు నొక తప్పొనరించితి నెట్లు గద్దెలోఁ
బమ్మినపేర్మిఁ బెట్టికొని బావ యశమ్మిఁక రక్షచేసెదో
నమ్మవలెన్ స్వబుద్ధికృతకార్యము గాదిది మోస మయ్యెఁజూ!. 124

ఉ. ఈవిధి దాఁప నేమిగల? దే నొక నిద్దుర వోయి లేచి మీ
బావయటంచుఁ దగ్గఱిఁ బాపి యతం డెటు లూహ చేసెనో
భావజు మర్మకర్మముల పాలొనరింపఁగఁ జొచ్చె నింతమున్
జీవము నీదు హస్తమున జిక్కెఁ గృతాగసురాల నెమ్మెయిన్. 125

ఉ. పాపపు నిద్రమత్తు పొరఁబా టొనరించెను గాక లేచితో
“రూపసి” యంచు వానిపయి రోషము జెంది స్వయంవరమ్ము గా
నాపగిదిన్ బయిన్ బడితివా? యిపు డేమన నేమి లాభమౌ?
దీపము గొంప దీసె. తన తేజము నంతకె పాయనేట్రికిన్. 126

మ. అది గాకన్ని విధాలఁ జెప్పినను నీ యాముఁగ దానెమ్ము కీ
గదిలోఁ జేర్పవలెన్? వినందు కద! యీకర్మమ్ము నేఁడబ్బె నాఁ
డుది యంచున్ మగవాఁ డటంచు నొకకట్టుంబాటు లేకున్న ని
గ్గది దక్కంగలదే? యిఁ కేమనుచు నేఁ బ్రాణమ్ముతో నుందునన్. 127

చ. అరమరలేమి నిగ్గుఁడి యంతయుఁ దెల్పెద నంతలోననే
నరసితిఁ గొన్ని సంగతుల “నాయన కా” రని, యప్పుడేని దు

శ్చరితుఁడు పోవసమ్మతిన సమ్మతి చెందఁగ వచ్చునా? "యిదే
దొరకెను సం" దటన్న గతి దుండగుఁ డయ్యె నిఁకేమి సేయుదున్? 128

చ. ఎవరిని బట్టినన్ విడువ రేను వచించితి నేనిఁ గోపమున్
దవులు నొకప్పు చూచితివె? "ధర్మమె! భార్యను వీడు" టంచు నే
మివిలి వచించుచున్ గనిన మిక్కుటపున్ మారియాద, వేఱ చె
ప్పవలయునే? యెఱుంగనివి భావగుణమ్ములు నీకు నున్నవే? 129

ఉ. ఎన్ని విధాలఁ జెప్పినను నించుకయున్ విన రేమి సేతు? నా
మె న్ననుజాచుకన్నఁ గడుమేటిగఁ జూడకయున్న దుర్యశో
భ్యున్నతి మిమ్ముఁ బొందు టటులుండెఁగ నెల్లరు నంతకన్నను
న్న న్ననువార లన్న "నిను నాలుక గోసెద"నంచుఁ బైఁ బడన్. 130

ఉ. దగ్గఱవాఁడు నీ పలుఁగు దాసిగుడుఁ బోతు లదేమి చెప్పిరో?
యగ్గికి దోసమబ్బినటు నబ్బెనిఁ గాక వచింపఁ జెల్లునే?
మగ్గి గృహమ్ములో నిముడుమానవతీతిలకంబు పట్ల నే
యొగ్గుచు, నెంతకుం దగరె? హీనులఁ గొంపలు గూల్చు కూళలన్. 131

చ. నిజమగు దోసమున్ గనియు నిందగృహస్థులు వృద్ధికాము లా
ర్యజనులు చూడకున్న యటు లక్కడనే వఱతుర్ దురాత్ములో!
ప్రజలకు గీడుసేయుటయు వర్తనమాట నసత్యమేని దా
ని జగతి కెక్కఁజేయుదురు నీచులఁ జేర్చికొనంగఁ జెల్లునే? 132

ఉ. పుట్టెఁడుపేర్మితోఁ బతి! భోరున నాయమ యేడ్వ వారమున్
గట్టిన యాపెకన్న ననుఁ గాదనరాదె? యెటుల్ వచించినన్
బట్టినపట్టు వీడ రని భావ మెఱుంగుదు కాదె? యింతకున్
గట్టెఁడి దైవ మామె నటు కాటికి వెట్టెడి నేమి సేయుదున్. 133

క. ఆయమ మేటిదై గృహమునందు సమస్తము చక్కఁబెట్టు నే
పోయిన నాపెచాటున విహారపు భార్యగ నుండి యిర్వురన్
బాయక కొల్వఁగాఁ దలఁతు బానిసతొత్తులు భార్య లౌదురే!
"చేయికి నందునే" యనుచు వీరపతివ్రత దాన నే మగున్. 134

చ. పతిరత యండె నేనియును వారకథూమణి, దాని కెట్టులో
ప్రతిన చెడన్ గుటుంబినికి రా వటు దుష్టినతు "లేమి" యంటివా?

సతిగల యింటి కిక్కఁగణి సంఘము చేరదు చేరెనేని యు
న్నతగుణు లందు రం దవగుణమ్ముల దప్పులు నొప్పొనర్పరే! 135

చ. తనుఁ బతియన్న భ్రాంతిమెయి దగ్గఱఁ జేరిన దుర్జనుండు గా
వునఁ గిఁ బయిన్ బడఁ గనేఁడే? యోగ్యుఁడు కొండొకనాతి యెట్టిదై
నను దనతల్లిగాఁ గనఁడె? న్యాయము దుర్మతి కేలతోఁచు? వె
వ్వాని ననఁగనేల? నాదు తలవ్రాఁతకు దుఃఖము నందఁగావలెన్. 136

చ. అని తనదైన తెల్వి యది యంతయు నట్టిపడన్ బతివ్రతాం
గనయును బోలె నీతులను గొప్పనసేయుచు నప్పగారిపై
ననుమతి చూపు టాదిగల యాగ్రహమంతయుఁ జూచి వాని నె
మ్మనము గరంగి నీరయి సమంజసమై కృప దాని కిట్లనన్. 137

ఆ. వె. ఇంత చెప్పనేల? యే నేటికాయన, తోడఁ జెప్పవాఁడ? దుడుకు చెంద
వలదు, తెల్లవాఱ వచ్చె నిద్రింత ము, పోవ మదిఁగొ చుక్క వొడిచె ననుచు. 138

తే. గీ. చేతిలోఁ జేయి వేయించి చెలియుఁ గొంత, యంతరంగమ్ము విశ్వాసమందఁబోయి
యాల్లఁ గనుమూసి నిద్రించునదియుఁ పోలె, నభినయించుచునుండె నయ్యవసరమున. 139

ఉ. వాఁడును “దీన వేమగునొ? వామవిలోచన” కంచు లోన న
త్తాఁడుచు “దాఁటుకోఁ గలిగి నంతటిదే చెలి” యంచు మెచ్చుచున్
“గూడిక కంతరాయ మొనఁగూడునొకో” యని చింత నొందుచున్
వేడుకదక్క “యెప్డు డిఁక వేఁగునొకో!” యని యెంచుచుండఁగన్. 140

క. కాకమ్ము లఱచె మున్నే, “కోకో” యని కోళ్ళు గూసెఁ గోకమ్ములు ను
శ్శ్రీకలిమి విఱ్ఱవీఁగె ది, వాకరుఁ డుదయించెఁ దెల్వి వఱలె జగమ్ముల్. 141

గద్య.

ఇది శ్రీ... తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం

బైన పాణిగృహీతయందుఁ

బంచమాశ్వాసము.



# పాణిగృహీత.

## షష్ఠాశ్వాసము.



క. కపటహృదయాంతర్ని
త్యకలితనాదస్వరూప దాతృక్ష్మాశ్రీ
ప్రకటితయశస్క బాభా,
సికలాజాలాభిరామ సీతారామా.

తే. గీ. అవధరింపు మనంతరం బయ్యుదారుఁ, డించుకేని యెఱుంగమి నెప్పటట్ల
నత్తలోదరితో మాటలాడఁగాని, యబల యొక్కింత మది సందియమునఁ బలుకు. 2

మ. తనమర్మం బది గుర్తెఱుంగు ననుచుఁ దన్వంగి యబ్బాలునిన్
గన మాటాడఁ, దదగ్రిమందు మసలంగా సందియం బందు నా
తనుఁడా ప్రేముడి కానిమోము గని తండ్రిన్ జెందు వేయేల? జీ
వనమే బర్వఁగ నెంచు మించిన త్రపాభారమ్ము చెల్లంగదా. 3

వ. అట్టియెడ నదారుం డచ్చెలిమిన్న చిన్నవోయినవిధమ్మున నున్న తెఱంగునకుఁ దన కన్నులు బన్నమ్ము గన్నయట్లు చింతించుచు సంతాప మగ్గలమ్ముగ డగ్గఱఁ జేరి బుజ్జగించి యిట్లను. 4

క. తెలవాటిన మొద లెప్పుడు, కలికిరో? గానమ్ము లేక కవితయు కృషిలో
మెలపుమఁ గలకలలాడెడి, తలఁ పేమిట్టి కీదినమునఁ దారగ చెడియెన్? 5

మ. కవి యేమయ్యెను? గైత యెం దడఁగె? శ్లోకల్ మాసె నే మిత్తలోఁ
జవి నానాఁటికి హెచ్చెనో? యుడిగెనో? చంద్రాస్య? పద్యమ్ము లె
య్యేవియేనిన్ రచియించితే! చదువు మేది? చూత మందెందు నె
ట్టివిశేషమ్ములు గల్గెనో? వెదఁగు బోఁటీ! యింత వంతేటికిన్.

ఉ. వచ్చిననాఁటఁ గోలె నిటు వామవిలోచన? యొక్కనాఁడునున్
ముచ్చట దక్కి యుండ వరమో మయి యీఁగనియంతవంతలోఁ
జొచ్చినదానిఁ బోలె నెటు చూచిన నొక్కవిధాన నుంటి వే
బొచ్చెము లేనిదాని కిటు పోలునె? నీకు వనీలకుంతలా. 7

క. చెప్పుము మది యెట్టిదైనన్, దప్పక తీర్తు ననఁ దరుణి తడవికొనుచుఁ దాఁ
జెప్పఁదగిన దొం డుండమి, నప్పటికిన్ బోఁగు హేతు వది కల్పించెన్. 8

క. కల్పించి మిగుల నేరుపు, జల్పనశక్తియును గల్గుసఖి గానఁ దగన్
తొల్పి యది యక్కృతమున దిగులొప్పినచదివెనుఁబోలెఁ గోమలి పలుకన్. 9

ఉ. మాటల కేమి లోపమగు? మానసవైఖరి మాఱెఁ గానిచో
నేటికి డాఁచి పెట్టితిరి? యేఁ గనకుండఁగ నిన్న జా, బిదే
నాఁటను జూడ లే దొకటి నాకును మీకు రహస్య మున్న దే?
చాటొనరింపఁగాఁ దగిసంగతి నా కడఁగంగ నేటికిన్? 10

క. మిము నమ్మ కాదె? నాము, ట్టనులకు దవ్వైతి నె తటక్కరులా? కటా!
క్రమముగ నను జేఱొక టగు, క్రమమునఁ జా చెదరు తప్పుగలిగెనె? చెప్పుఁడీ. 11

క. మీయాజ్ఞ మీఱితినో? మీ, కాయాసకరమ్ము లైనయా యాకోర్కుల్
పాయక కోరితినో? న, న్నీయెడ సుంత జూడ నేల? యే లాతినొకో? 12

ఆ. వె. మొదలనుండి నన్ను నెద నిట్లు భావింతు, రేని యింత చింత పూనకుందుఁ
బూవు లమ్మచోటఁ బుడక లేగతి నమ్మ, దాన! మీ రెఱుఁగని ధర్మమున్నె? 13

క. ఇఁక మిమ్ముఁ గొల్చుసన్నిహితు, లకటా! నను గారవింతురా? వినరే? నా
యకుఁ డొకటి గొట్టినను మా, ఘుకరపువాఁ డొకటి గొట్టదొరఁకొనకున్నే? 14

ఉ. పేమి దప్పుచో నిచటఁ బెండెలు వట్టుక వ్రేల నేల? యిల్
చేయుదువా? యటున్న మది చిల్కను పంజరమందుఁ గొన్నినా
ళ్కీరము దా వసించి పయి లేచి చనంగ స్వజాతి దానిపైఁ
గారము నూఱుఁగాని తగుగారవముల్ బచరించి యేలునే? 15

క. కొలమునకున్ వెలి యయితిన్, బలవంతపుబ్రాహ్మణార్థవైఖరి మీకున్
జలుక నగుదాన నైతిన్. దలవ్రాఁతకుఁ జింతసేయఁ దగదే? నాకున్. 16

క. అని బుడిబుడిమఃఖరమ్మునఁ, గనుఁగవ నశ్రువులు దొరఁగఁగా గద్గదని
స్వన మొలయ మాట లాడఁగ, ననువుపడనివిధము దోఁప నది విరమింపన్. 17

చ. "ఇది యొకహేతు వౌనె చెలి? యింతటివంతను, దాన నేమి యు
న్నది? యడఁగంగ నేల? కనినంతన యేమనువాఁడ? జూడు మ
య్యది యటుఁ బెట్టియున్న" దని యాతఁడు తెచ్చి యొసంగునంత న
మ్మదిత పఠింప దించుకయు మోమటు త్రిప్పదు వ్యాజమాత్రియై. 18

క. దాని కతఁ డెంతయేనియు, లోనొగిలి తదంగసాతిలోలుం డగుటన్
"మానిని? విను వినిచెద నీ,-నా నేరము సైఁప" మనుచు నారంభించెన్. 19

క. శ్రీరస్తు చిరంజీవి యు, దారునకున్ దల్లి శోభనావాప్తిగ నా
శీరాదిపూర్వకమ్ముగ, మీ టెన పేర్మిమున వ్రాయుమే లే మనిసన్? 20

మ. కనుమా రెవ్వరో? నీ వెఱుంగవు, నినుం గన్నట్టులే పెంచి పె
ద్దను గాఁ జేసి గృహస్థుగా సలిపి సంతానాఢ్యుఁగాఁ జూడకే
చనె మీ తండ్రి, యభాగ్యురాల నగు నేఁ జాయాపరిత్యాగ మిం
గన జీవించితి నేటి కీబ్రతుకు? ప్రాక్కర్మమ్ము నిందాక్షమే! 21

క. కడచినదానిని పోనిమ్ము, దడవిన లాభమ్ము గలదె? దారను నీకున్
బడదయ్యెఁ బురాకృత మి, య్యెడ దా నట్లుండె దాని కెవ్వరు కర్తల్. 22

క. "ధనమును వెచ్చించితి" వని, మనమున దిగులొందఁ గలరె? మనుమలు దీనిన్
దినఁగ, మనము వడు పొట్టలు, చనకుండునె? చాఁ జిరుగం జదరయుఁ గాదే! 23

క. చెప్పితిఁ జెప్పించితి నీ, వొప్పమియును దెలిసికొంటి నూఱట గనలే
కిప్పు డిఁక నొకటి వ్రాసెద, నప్పా! యిద్దానికైన ననుమతి గొనుమా!. 24

ఆ. వె. వయసు కొద్ది యైనవాఁడవు గాన నీ, కిష్ట మైనకన్నె నేతి తెచ్చి
కొనుము పెండ్లి చేసి ధనమెల్ల మీ కిచ్చి, సంతసింతు మేను సతియుఁ గాంచి. 25

గీ. ఇంక నొకమాట భార్యయం దిష్టమింతు, కయును లేదేని యీ పెండ్లి గాని సుఖసు
ఖాల మేమిట్టు లొప్పుట గాదనుమ్ము, నేస్తు వరు లెక్కరణినైనఁ గీర్తికరము. 26

క. నీయిష్ట మెట్టులేని సతీయుతుఁడవు గమ్ము నీకుఁ దీపి గలుగునా
కోయువిద యంటివా? యది, పాయనిదే మేము చెప్పవారము యచటన్. 27

క. అని వినిపించిన వినియు, వ్యాసజాక్షియు సతినిఁ జూచి "వనమున్ గోమరున్
గొనములు గలసతి యుండఁగఁ, జను నే? నీ కిట్లు మమ్ముఁ జక్కన్ బెట్టన్". 28

తే. గీ. నీవు బాగుగనే యుందు నింద నాది, యొందు కీఱ్ఱ? నీకు నే నెప్పుడేని
"భార్య వదలు" మటంచుఁ జెప్పమగదా! వి, వేకవంతు లెఱుంగని విధులు కలవె 29

క. అని తనమనమునఁ గలవిసు, పునరో యిచ్ఛకము కాని పొలంతి తగుగతిన్
దనకున్ బోధించిన నాతనియనమును గొంతకొంత దారన్ మరగెన్. 30

తే. గీ. ఉత్తరమ్మును వినిచిన యువతి దానఁ, గొంతకాంతిం దిట్టుల కుటిలుఁడతఁడు
తలఁచె నాజలజాక్షి యట్టులనె యభిన, యించె మదిమన్న తెఱఁగది యెటుకుఁ బోవు. 31

క. ఆగతిఁ గొన్ని దినమ్ములు, నేఁ కుటయును నప్పుడేని యింతిమనము దా
బాగుపడదయ్యె దానివి, రాగఫుగతి గాంచి దాఁ గరము శంకితుఁడై. 32

ఆ. వె. ఒద్ద నుండువారి నొక్కొక్కరిని నల్లనల్ల నడుగుటయును నంద తెలిసెఁగి
యున్నవారలైన నూరకయుండి రె, వ్వారికి వలయు నిట్టిపాడుగొడవ. 33

"రమణుఁడు తన్నుఁ జూచుటకు రా కెటు తక్కెనొ?" యంచుఁ గేళిస
ద్మము విడి వచ్చె నచ్చెలి యమారుఁడు చింతిలుచున్న చోటికిన్. 43

ఉ. వచ్చెనుగాని రాత్రి యొక వైఖరి స్వప్నము గాంచి యాఁటచే
నచ్చపలాక్షి యందుఁ గలయాత్మస్మృతిన్ దలపోసి "నిక్కమా
చెప్పుటఁ గాని యేమొ విధి యెట్లొనరించునొ" యంచు సంశయం
బిచ్చఁ జరింప నగ్రమున నే యొక భంగిని నిల్చె రిత్తగన్. 44

చ. నిలిచినయంత నచ్చెలికి నేత్రము గాఁ జలియించె దానికిం
బలరక దక్షిణంపుఁ గనుపం బగుటన్ మఱికొంత సందియం
బొలయఁగ "నూరకే యిటుల నుండుటయున్ గల" దంచు దాని లో
దులుపుచు తేనితోఁ స మలతోయ్యలి దాఁచుచు నట్లయుండఁగన్. 45

ఉ. ఎవ్వఁడు దేనిగాలి యొకయించుక సోఁకినఁ దుర్గ్రమ మ నిం
కెవ్వఁడు దేనిరాఁక కెను రేగి యెడన్ దమిఁ గౌఁగిలించు నిం
కెవ్వఁడు భార మం చెఱుఁగ కెప్పటి కంకము నంద నిల్పు వాఁ
డవ్వగలాఁడె వచ్చుటను యాత్మ దలంచఁ కు నారుఁ డయ్యెడన్. 46

క. అటు నిలువం బడి చింతాజటిల మ్మగు నతనిచిత్తసరణిన్ గల దే
మిటి యొకొ? యిటు లింతటిలో, మటుమటు యాతనికిఁ గల్గు మర్మ మదేమో! 47

క. న్యాలకుఁడు తంపి పెట్టెనొ?, బాలకుఁ డేతఁ డేటి కట్టె షని యొనరించున్
గూళ లెవరేని పనికి, నీల యుడి వదింపఁ జేసి రేమో? మరలన్. 48

ఉ. ఏ నొనరించు చేష్ట యది యాచినవాఁ డొకరుండె కాక యీ
వానరసేన కెల్లెఱుఁగ వచ్చె? నెఱుంగక యేమి కిల్లి దా
గానని కన్నులన్ భయముఁ గప్పను నొందుచుఁ బాలు దాఁగ నే
ర్గానరె! కొంపఁ దీయుటకుఁ గాఁ బ్రయత్నించిరొ యేమొ? యీసున్. 49

చ. ఎటు దొరకున్? ధరాంగనను నెట్టికొలమ్మ వయస్సు రూపమ
క్కటికము పేర్మి గూర్మి గల కాముకుఁ, డేటికిఁ బోతె? వానితోఁ
గుటిలుఁడు వానికైత యది గొంతుక గోసె, దరిద్రుఁ డేటి కీ
చ్చటి కరుదెంచెఁ గూళవిధి కెయ్యది లెవ్వరి నెట్లు సేయునే! 50

ఉ. హాయిగఁ బద్దెముల్ చదివినంతట వానికిఁ జిక్కెఁ గాని యీ
కోయనికొంత దాఁ దెలిసికో గమకించెనె? పాపబుద్ధి. ఛీ!

ఛీ! యని యీతఁ డింక నెడఁ జేసినఁ "జాలును" నంచు జీవమున్
రోయక యెట్టులుందు! సరిరోయునదల్ నను జూచి నవ్వఁగన్. 51

ఉ. ఎంతటిభాగ్యమే! యనుచు నెంతయదృష్టమె! యంచు నెంతబల్
వింతలె? యంచు నొంకపొర లేనితలంపులె యంచు ముక్కునై
నింతులు కేలు వెట్టికొని యెల్లపుడు న్నుతియించు నాకు నీ
వంతయు నిక్కమైనను రవంతయుఁ గూడవు జీవనస్థితుల్. 52

గీ. మఱుగు గాలంకరణలోఁ జోడుమువల్గు, లేదఁ సంసారిణులతో వ్రతేల! తుక్క
కిందు నే? నేయి"యని మోము నేయుట కెల్ల, నాకు నిందింప బ్రతికిన భాగ్యమేమి. 53

చ. పొదమిత నేకాలమ్మునని పొందితి మిక్కుటమైనభోగముల్
కడపితిఁ గాల మెల్ల వృథ గాక సుఖమ్ముల కెల్లరైయె చనన్
దోడిగితిఁ గట్టితిన్ గులమునొయ్యలు లెల్ల నిటా సనంగ ని
య్యెడ నీక నేమియైన నగు నెంతయు శాశ్వత మీశరీరముల్. 54

ఉ. వినను నాత్మహత్య యది యంత శుభప్రద మంచు నెంచమిన్
నానెఱజాణచెయ్దముల నాయకుఁ గా దని నమ్మఁ జేసి నా
పై నెవ రిట్లు చెప్పిరో! కృపారహితుల్ కపటాత్ము, లిప్పు డ
క్కాని దురాత్ములన్ విడలఁగా నొనరించెదఁ గాక యం చొగిన్. 55

ఉ. చిత్తము గట్టి చేసికొని చిన్నె లెఱింగినజాణ గాన లో
న త్తలపాటు లేనిచెలియాం బలె దగ్గఱఁ జేరి వెన్కరై
య త్తలి గాకఁబోడి కను లల్లనఁ జేతుల మూసె నంతలోఁ
ద త్తరమంది "యెవ్వ" రని తక్కరకంజసమాగమమ్మునన్. 56

క. మెత్త వడిఁ డిచి తత్తమ్మను నొత్తిగిలన్ జేసి, చేతు లొక్కింతన దా
నె త్తి వెలిఁ జిమ్మి "సీ!సీ!, తొత్తా! నను ముట్టఁ బోకు తొలఁగు" మటన్నన్. 57

ఆ. వె. డిల్లవోయి తనదు డెందమ్ము పతికిమ్మలై, కట్టు దప్పఁ "గలలు కల్ల గావు
కటువుము నను చాపల్యముల్ నిజ"మని, మనసు మరల ధైర్యమునకుఁ జొనిపి. 58

క. "పరకీయచందము నకున్, జారబడితిం గాని కుంతసామ్మునకై క
క్కురితిం బడనుగదా! యో, తరుణులకున్ లేని విట్టి దశ" లని వగచున్. 59

వ. అని తాఁ దురవాటి యవ్వారిజాక్షి చురచురఁ జూచుచు. 60

క. అని యటు నిలువక బాలక, చని వేఱొక్కెడకుఁ గొంత శాంతించియు న
వ్వనితన్ శుకవిన్ సహితమ్ముగనె యిలువెడలింప నెంచి కలకువోడముగన్ 72

ఆ. వె. తగినమిత్రు నొకని దగ్గఱఁగాఁ బిల్చి, కార్య మిట్టిదని యనఁగా నతండు
సంశయించి పిదపఁ జాన యున్నెడ కేగి, యిట్టులనియెఁ జిన్నయెలుఁగు దోఁప.

చ. వెలఁదిరో! యుగ్రుఁడై యతఁడు వెళ్లుము నుండెఁ దటాల్న నిర్దయుం
డాలఁగుము లేనిచోఁ గలుగుఁ దొందర లెట్టిదియేని యింకఁ బైఁ
బిలువఁగ వచ్చు నీ వపుడు ప్రేమిమై నట రాను వచ్చు, నిన్
దలఁచిన నీరు గాఁడె? యిటు తా వ్యథగా వెడలింప నేటికిన్. 73

క. అని యెన్ని చెప్పినను న, వ్వనిత వినదు దానియెడల భయభక్తులతోఁ
జను నాకేఁ డేమి సేయుదు? నె? వనిత మగుఁ? దాని నచోటు వానన్ జేయన్. 74

క. పదపడి లోఁకువ యగుటన్, గదలించెన్ శుకవి నిల్లు గదలి చనెడియా
త్మదయితు చందమ్మునకున్, మదిఁ దనదశకన్న వెలఁది మలమల మఱుఁగున్. 75

క. అటు లొక్కరెండు దినములు, కటకట! యని యెల్లరఁ గలిగి యనశన
స్ఫుటకటినోపోషణముల, నటఁ గదలక యతనికరుణకై కాచునెడన్. 76

తే. గీ. కరుణ కొంచనియు నాతఁడక్కలికి యెఱుఁగ, కుంభవిధమున డాఁచి "యి
ట్లొట్టిరింటు, విడుచుపిమ్మటకలసిన డిదికిటుకు, రమ్మనినబుద్ధి గానుండురమణి" యనుచు

క. లోనెంచి దాని నానా,నూనవిభూషణకదంబ మొకటిగ నుఁ గొన క
మ్మానినియిలు చేర్పించియు, దానిజనని కిల్లువార్త దా నంపించెన్. 78

క. నీకొమిరె దుర్మదంపుం, బోకిళ్లకు నాకు రోఁత పుట్టెఁ "జను" మన్
వే కదలదు రెణ్ణాళ్లై, శోకించుచు లంఘనముల నుక్కుచు నుండెన్. 79

తే. గీ. దానియాస్తి యావత్తు నీదగ్గఱ కిపు, డంపితిని నీవు వచ్చి నీయాత్మజాతఁ
దీసికొనిపొమ్ము లేనిచో దీనిని బల్మ, వంతముగ నిల్లు వెడలింప వలసి వచ్చు. 80

క. అనుమాట వినినయంతన, చని తా నవ్వేశ్యమాత జామాతను నే
ర్పినరీతి వేడికొని యా,తని చవుం గాన కంతఁ దనయన్ గనియెన్. 81

క. మెలమెల్లన బోధించియుఁ, జలమున రానొల్ల ననెడిచానన్ బలిమిన్
వెలికిన్ గొని చనె నదియున్, వ్వేఁ దనయిలు సేరి లోన వగచుచునుండెన్. 82

క. ఇదియంతయు విని "దైవము, బ్రిదికించె న్నన్ను నాదుపట్టయి" యని య
మ్మదిత యిలుసొచ్చెఁ గవ్వపు,శదు "డదియేమనునో" య నెడిశంక వెనబడన్. 78

చ. కళవళమందుచున్ వెతలఁ గందుచుఁ గుందుచు నున్నబోఁటి య
వ్వల వలపున్ మగండటుల వచ్చినయంతన తేటిమాచి వె
ల్వెల దిగఁద్రావి యాతనిచవిన్ బడి కుల్కఁగ సాగ నద్దిరే!
వెలచెలి కబ్బునవ్విరహవేదన లీఁద నశక్య మెట్లగున్. 83

ఉ. "ఏమిటికై వరించితివొ యిప్పుడుఁగుంగవిఁ దీరెఁగాదె! యా
యామదమెల్ల, నింకయిన నవ్వలి కంపక కొంప కేమటం
చీమెయి దూర్చెదే?" యనుచు వృద్ధ వెసన్ దలనోరు మొత్తుకోఁ
గోమలి లెక్కసేయక యకూటములన్ గరఁగించునక్కవిన్. 84

ఉ. ఆగతి నిర్భయంపుసుఖ మందుచు నాగజయాన లోన నా
నాగతి "నాప్రియుం డిటుల నాకయి శాఁ దనయంత వచ్చి బ
ల్లోఁగినవాఁ డెటుల్ దలఁపులో ననుఁ బాయఁ గలండు దుర్మతుల్
వాఁగెడికూఁతలన్ విడుచువాఁడె! యతం" డని యెంచు సారెకున్. 85

చ. అచట నుదారుఁడున్ దరుణికై వగఁ జెందుచు నెప్పుడేనిఁ దా
న చని వెలందిఁ జూచుటకునై మది నెంచియు నట్టులైనచో
"సచివులు భృత్యులున్ మిగులఁ జౌకగ నెంతు" రటంచుఁ గొందు "న
వ్విచికిలగంధిసాటి పదివేలను లే" రని లోనఁ జింతిలున్. 86

క. డోలాయమాన మగుమది, తో లీలలు దక్కి యతఁడు తొయ్యలిఫోటో
లాలోకించుచుఁ గుందుచుఁ, గాలమ్మును గడుపుచుండెఁ గళవళపడుచున్. 87

క. ఆరీతియెల్లఁ గని "య, వ్వారాంగన యిటుల మరల వచ్చుట తగ దం
చారూఢి నతనిమిత్రులు, వారించెడివలను జూచువా రయి కడఁకన్. 88

తే. గీ. దానియప్పటివర్తనఁ దథ్యముగ నెఱింగి "యిప్పటికేని యాసంగులాఁడి
వాని వదలదు నీవు నీవంత యేల?, కావలసెనేనిఁ బట్టియీఁగలము మేము" 89

క. అనుడు "నటులాచరించు నెడఁ, వనితకుఁ బొరపాటు మొదల వచ్చెనుగా క
ప్పని బుద్ధికృతము గా" దని, తనమదిలో నున్నతెఱఁ గతండు వచింపన్. 90

క. వారును నొకసమయము గని, యారామామణికిఁ గవికి నటుచేరిక క
న్నారంగన్ జూపంగ ను, దారుని రాగాంకురము మొదటికి నశించెన్. 91

క. తనతప్పిదమును బ్రియుఁడే, కనలారఁగఁ జూచుటయును గాంత యొకవిధం
బున నప్పుడు బొంకి కన్నమి, నన నానిదురకు లెల్ల ననిపించికొనెన్. 92

చ. పదపడి యింక నాథనికృపన్ గడియించుట దుర్లభం బటం
చెదఁ దలపోసి యాస మొదలే నశియింపఁగ ధైర్యవంతయున్
వదలి "యిఁకేటికిబెట్టుసరి! వైఖరి బొత్తిగఁ దప్పె"నంచు న
మ్ముదిత "యుపాయ మిట్టి" దని మాటికి నెంచి కృతప్రయత్నయై 94

మ. తననున్ దానయి యొక్కరేయి యతనిన్ దర్శించి దీనాస్యయై
యనుమాన మ్మొకయింత లేక చరణమ్మందున్ శిరం బుంచి, పే
ర్మి ననున్ వే గరుణింపఁ దప్పదనుచున్ మే లెంచు మంచున్, వచిం
పనిదయ్యున్ స్ఫురియింపఁ జేసి కరుణన్ బాటింపనున్నంతటన్. 95

ఉ. ముందుచు నింటి కేగి దనమం గలతెల్వి యదెల్ల దైన్యపుం
జందమునంద చేర్చి యొకజాబిటు వ్రాయఁగఁ బూనె నద్దిరా!
చందనగంధులెట్టిఘనసాహస మైన నొనర్చి బొంకి నా
గుం దమచెయ్వులన్ వెతకఁ ద్రొక్కఁగఁ జేయుదు రెట్టి కృద్ధునిన్ 96

క. య మ్మా రార్వె గారికి, నమ్మినమీదాసి చరణనతముఖినై దం
డమ్ములు సారెకు మ్రొక్కుచు, నిమ్మెయివ్రాసికొనుమనవు లియ్యవి యయ్యెన్

చ. ఎనిమిదియేండ్లనుండి మిము నీక్షణమున్ బెడఁబాయనైతిఁ గా
దని తమ రూరికిన్ జనినయప్పుడు కాలము లెక్కపెట్టుచున్
దినములు ప్రచ్చు దాన నిదె దేవునిచెయ్యిరి నాఱునాళ్లనుం
డి సెనరు మాలి మీరు కరుణింపమి నీగతి నుంటి నొంటిగన్

క. ఇఁక నుండఁజాల నాచే, యకుటిలచేష్ట లవి యెన్నియో మనమున లె
క్కకుఁ దా మెఱింగి యోజిం, చి కరుణ నిల్పఁ దగు నాదుజీవము తటితోన్

క. పే రేల చెప్పవలె నన్, బ్రేరేపించి రిటు మీరుఁ బ్రియము గలుగువా
రారయ కాదుర్బోధను, ధీరత్వము గోలుపోయితిన్ జెడితి నిటుల్

క. నాకర్మమ్మునఁ గలపని, యేకారణమైన నేమి! యిటు లాకపరిఁ దాఁ
జేకూరె నిక్క మిది పై, శోకించితి మొదలఁ దెలివి చొప్పడదయ్యెన్. 100

చ. తదుపరి యెంత యేడ్చినను దాఁ "జెయి గాలినమీఁద నాకులన్
వెదకుట, వంటి దయ్యె ననుపీడేఁడి గా గణియించి యిట్టిబె
ట్టిద మగుచింతకున్ జోమపుటే యొకయాటగ నెంచి వారు న
న్నది పొనరింపఁ జేసి, రెవరైనను గర్మము దాఁటువార మే?. 101

క. ఈగతి నాతల వ్రాసె న్వి, ధాఁతవిధి, తలఁపు మిమ్ముఁ దగులమి నోరసై
రాగిల్లి మనఃపూర్వక, భోగము గావింప లేను పొరఁబడి చెడితిన్. 102

ఉ. ఏకొలమందుఁ బుట్టితిని నిన్నిదినమ్ములనుండి మీగృహాం
తేకనివాస మాట నిఁక నిప్పుడుపుంగొలపుంగృహమ్మున
న్నానుఁ బదమ్ము లాగవు ధనమ్మును వద్దు మనమ్ము వద్దు నా
రాఁకను మాత్రి మొప్పము కరమ్ములు మోడ్చితి నేడ్చితిన్ సఖా.

చ. కడుపున కింత యన్నమును గట్టుకొనంగను బ్రాఁతచీరలే
నిడుఁడిది చాలు నాయసువు లెంతను నీచెరుమేన నుండు న
క్కొడదనుకన్ భవచ్చరణకంజములన్ గనిపెట్టుకొందు నిల్
దుడిచెదఁ బ్రక్కలన్ బఱతుఁ దొట్టికర్మము నెంచుమన్ బ్రియా.

ఉ. ఇచ్చక మంచు నెంచకుఁ డిఁకెన్నఁడు నన్నును గూడ వద్దు పై
రచ్చను వ్రాసి యిచ్చెదను రాగి దుకాణియుఁ గోరకుండ లో
నచ్చెదు నాకుఁ దల్లికిని నాథ! యెటుల్ వసియింతు నింట, నా
ముచ్చటిదొక్కటే, చిగురుము ద్దిటు చెల్లఁగఁ జేయు మెమ్మెయిన్. 106

ఉ. మీ రెటు సేయు మన్న నటు మీఱక చేసెదఁ గన్నులార మి
మ్మారయు టొక్కటే వలయు నన్యము గోరను మీదుదాసి కీ
చేరిక నిచ్చి పాదములఁ జేర్పుఁడదే పదివేలు దీని నిం
కేరికిఁ జూపకే పనుపుఁ డించుకవార్త, క్షమింపుఁ డన్నియున్. 107

క. ఇచ్చయొ యనిచ్ఛయో వ్యా, రిచ్చపలస్వాంత కిపుడ యెర్పఱుపవలెన్
బొచ్చెమ్ము వలవ దది వ్యా, యచ్చరములతోడ వ్రాయు టభ్యర్థింతున్. 108

క. అనివ్రాసియంపుటయు దా, నిని గని యాతండు మనము నీరగుటయు మా
నినిఁ దలఁచి తలఁచి తనలో, ననుకొను నిక్కరణిఁ బ్రేమ వగ్గల మగుడున్

మ. అకటా! యంతటిదాని కిక్కరణి దైన్యం బింత వాటిల్లునే!
వికలత్వం బహురా! నృపాంగనగతిన్, వేమంది సేవించుదా
నికి దాస్యంబుచితంబె! యెంతవగపున్ జిత్తమ్మునన్ లేనిచో
సకి యీనీచత కొప్పునే!, చెలిరో! పశ్చాత్తాప మిట్లున్నదే! 110

క. కానిమ్ము నిన్ను మరలన్, బూనికమైఁ గొన్న మొగముపొంతనె లోకుల్
"ఛీ! వింద్యుఁ" డనుచు నుమియరె!, నానేరం బేమి! యిఁకను నాసేయునికో. 111

ఉ॥ నీటును గోటునున్ దగిననేరుపు నోరుపు వన్నెచిన్నెలున్
చేటయుఁ దెల్వితేటయుఁ గలుగునె యువ్వుఁబోఁడ్యలు లెందఱేని నీ
పాటిఁ బెలింద లౌదురె? సెబాసు! బళా! వహావా! వహావ్వ! నీ
మాటలసొంపుతీరు గలమానిని వేఱు జగానఁ గానఁగా.

చ॥ గళగళ లాడుగాగరలు కంగులు రంగు లెసంగురైకలున్
హారువున మూర్వ్యనం దగుపటుంటలు పోడరు లత్తరుల్ విరుల్
గర మలరారుభూషలును గాక వెలందు లటుంచుఁ గల్గిరే?
సరసిరుహాక్షి? మీకొలముచానలలో నినుఁ దక్క నొక్కఁడున్. 112

చ॥ అగుదువు సోయగమ్ముగలయట్టివిలాసిని వైన నేమి? నీ
సొగసును జూపుటోపులును సుందరి? వ్యర్థము లంచుఁ జెప్పఁగా
దగు నది యేమనన్ వినుము తన్వి? యోగ్యత లేనియప్పు డ
మ్మగువను బొందువాఁ డనగ మాలఁడొ? మాదిగవాఁడొ? గాఁదగున్. 114

తే. గీ. ఎంతసౌందర్యముండిన నేమిఫలము? యోగ్యత యొకింతగలుగని యువతిమణికి
నెన్నినగలెట్టి న్పాదయేమి. డెట్టివిభవములుండినను బొట్టులేమన్న ముండయనరె?

తే. గీ. నిన్ను నిందించుకన్నను నన్ను నేన నింద యొనరించుటది మంచిచంద మతివ!
గాన నావంటివిశ్వాసహీనుఁ డెందుఁ, గానరాఁడు జగమ్మునఁ గలికిమిన్న.

ఉ. ఎందఱినైనఁ జూచితి నికెందఱినైనను జూడనుంటి నో
సుందరి! నీదుచందమును సొంపును నింపు దలంపు నింపు నే
మందు! నవారవిందవదనా? పద నాయొద నాటఁ బోదు నీ
వం దగునందగానిఁ గయికొందువు నా కయి యంద నేట్రికిన్.

క. అని యచ్చెలి తనయెమటున్, గనుపట్టెడుభాతి దోఁపఁగాఁ బల్కెడియా
తనిచందము గని దూతిక, యను, "నయ్యా! నన్నుఁ బంపరా! యిఁకనైనన్". 117

క. దానఁ దెలివొంది "తనయు, జ్ఞానభరం బది యెటెంగెఁ గా!" యని లజ్జన్
లో నొందుచుఁ "జను ముత్తర, మే నీ తే" దని వచింపు మేట్రికిఁ దడయన్,

చ. అన వదియేగ, నంతవల నాజలజాక్షియుఁ "బోయి దూతి రా
దనుకొన లేఖ తెచ్చునో? యుంచుఁ దపించు "నాసంగుండునే?"
యని ధృతి గాంచు "వట్టిచుడియాసల" యాచు నిరాశ నించు దే
నిని ధిని ప్రాణముల్ విడుతు నే" ననుకొంచుఁ గుంచు మందులన్. 119

ఉ. నేర్చియు నేరమో యిటుల నే నొనరించితిఁ దప్పు, దాన బల్
పేర్చినయాగ్రహమ్ముమెయిఁ బ్రేమ యొకింతయు లేక యింత న
న్నేర్చునె! భార్యనే? పడఁబుట్టింతిని గానె? యిదెంత దోస మీ
చర్చ యదేల? యాతనికిఁ జచ్చి యశమ్మునఁ గూర్చు టొప్పదే. 121

క. అని కృతనిశ్చయయై విష, మును సిద్ధము చేసికొని యమోఘవ్యవసా
యనిబద్ధచిత్తయై యుం, డునెడఁ దతి కేగి యయ్యనుంగుఁ జెలియున్. 122

క. “ప్రత్యుత్తర మీ లే” దన, నత్యంతామర్షఘూర్ణితాంతరయై “ప్రా
ణత్యాగమె వర మిఁక సం, స్తుత్యనుగుణం పుబ్రతుకు చొప్పడ నేలా?

క. మును వేశ్య లొక్కకొందఱు, తనువున్ విటుతోడ వీడి తద్దయుఁ గీర్తిన్
గొని రేను విటునియవమతి, గని ప్రాణం బూడ్చి సుచిరయశమున్ గొందున్

క. అని మరల మనము వెనుదీ, సినఁ దత్తరపాటు దక్కి చెలి సంక్షేప
మ్మునఁ దనయుద్యమమును నా, తని కీగతి వ్రాసెఁ దెగువ దైవారంగన్.

ఉ. ఇంతకు మున్ను మీరు లిఖియించిన కమ్మప్రకార మేను మీ
చెంత భవత్పదాబ్జములసేవకు నై బ్రదుకన్ దలంతు నో
కాంత! బహూక్తు లేల? యది కష్టము? యిష్టము? నేఁటిరాత్రికే
పంతము మాని తెల్పు టది బాగని యెంచి నమస్కరించితిన్. 125

క. అని వ్రాసి మరల నంపినఁ, గనుఁగొని లోలోన నతఁడు కరుణామోదమయున్
వెనువెంటఁ గోపముబ్బఁగఁ, దనలో దానిట్లొకింత తల్లడ మందున్. 126

ఉ. చచ్చుట నిక్కమే యగు విశాలవిలోచన, చాక యుండుఁ గా
కిచ్చుట కెట్లు గాఁ దగు? నిహీ! యని యెల్లర నవ్వరే? సరే
యచ్చటులాక్షి యీపయిఁ గులాచరణం బొనరించి కాలముం
బుచ్చుటకన్నఁ జచ్చుటయె పోల్కడు మే లగు నెన్నిభంగులన్. 127

వ॥ అని యుద్దానిం దలంచుకొని.

ఆ. వె. ఇప్పుడు చావ నేల? యింతకు మున్న చచ్చితిని నీవకాదు చెలి యుమిన్న
వీఁడు నట్టివాఁడె, ఖేదమ్ము లేనె?, మనకు నెన్నఁడేని వనజనయన. 128

ఉ. పుట్టరే? గిట్టరె? జనులు పుట్టిన నే మగుఁ? గిట్ట నేమగున్?
గట్టువర్తనమ్ము చెడి శాపథవర్తను లైనవారి కే

ప్పట్టున సౌఖ్య ముండ దథవా యొకపట్టునఁ గల్గుఁగాక దా
నిట్టిద యౌ నిసీ! చెడితి నెమ్మెయి నన్ జెడఁగొట్టితంగనా.

మ. గృహిణీరత్నమునందు నీకుఁ గలరక్తిన్ గాంచి నీహేతువై
“బహుదుశ్శీలము మీకొలమ్ము గుణముం బాటించు” నం చెంచితిన్
మహిళారత్నమ! యన్నియున్ మృషలె నీమాటల్ సెబా! సింతయున్
బహిఁ బెట్టున్ బడి ప్రాణ మూడ్చు మనుచున్ వ్రాసెన్ విధాత్రం దహో.

ఉ. ఏనను జీవ మూడ్చుకొనకే ప్రియతింతునో? దాన నేమగున్?
మానిని! యోఁదుదాని కది మన్ననఁ దెచ్చుకొనట్లు పూరుషుం
డేని నొసంగఁ దెక్కరణి నిన్ విడియుండుదు నేమొగమ్ముతో
నే నిమఁ బూర్వమున్ బలె గణింతు? ఘటింపవు రెండునున్ జెలీ. 132

క. అని యత్తఱి జాబునకును, దనప్రత్యుత్తరము నిడక తరుణీమణి దూ,
తని వంపుడు దా నచ్చెలి,విని యాపై నోడలు వీడ విసమున్ మెసవెన్. 133

క. అక్కట నవ త్తలోదరి, మిక్కుటమగు నార్తిగూరి మృతి గనుటయు నీ
వెక్కసపువార్త విని మది,నెక్కుడు చింతించె నాతఁ డిదియొప్పదొకో. 134

చ. అయ్యదియెట్టిదైన, హృదయంబు సదా తదధీనమౌగతిన్
నెయ్యముమై మెలంగునలనీటు వెడంగు బొజుంగు నేఁటి క
త్తొయ్యలి యాత్మ హేతువున దుష్కమెయిన్ మృతిఁజెంద నెంతగా
దయ్యము సేఁతకై వగచి తాళఁగలే కెదఁగుందఁగావలెన్. 135

క. పగవారల మృతికైనను,దగువారలహృదయమునకుఁ దాపము దవులున్
మిగులఁ బ్రియమైన యాసో,యగపుంగని కతఁడు శోకమందుట తగదే! 136

చ. అరసితిరే? యుదారగతి, యక్కట! యెంతరు వచ్చె! ద్రవ్యమా?
మురిగ యశంబు గంగఁబడెఁ జొక్కపు మేని పసం దడంగె దు
ర్భరమగు పాతకం బొకటి పైఁబడె దుఃఖముతోడిపా టుహా
దురితపుసంత వారసతితోఁ దగునే? తగులాట మేరికిన్. 137

వ. పదపడి యయ్యుదారుండును.

ఉ. దానిప్రసక్తి మెల్ల దిగఁద్రావి స్వకీయపురమ్ముఁ జేరి యా
పైని స్వభార్య దాను నొకపాటి గృహస్థుఁడుపోలె నుండి ర

జ్ఞాన మదెల్లఁ బోయె భవసాగర మెందు నసార మంచు లో
లో నెఱిఁగెన్ మఱెయ్యెడల లోలుఁడు గామియు దానఁ జేసి తెన్. 138

క. ఆపయి వేశ్య లనినఁ ద్రవ్యాభ్యపృతి గలవార లనిన సత్యాధికానూ
యాపవరశుఁడై చూచు స్వలోపములన్నియును దలఁచి లో లజ్జించున్. 139

చ. తనభయ మింత లేమిని యదాయద లౌనలయగ్రహారముల్
గనుఁగొని వానిపై ఋణము గల్గుటకున్ మది రోసి వానినె
ల్లను వెసఁ దీర్చి తల్లి తనలక్షణముల్ గని సంతసింప నీ
తిని గనె నెల్లభంగుల నుదీర్ణయశం బనిశంబు గ్రమ్మఁగన్. 140

గద్య.

ఇది శ్రీకింకవింధ్రఘుటాపంచానన విద్వత్కవిబాలకళానిధి
బాలసరస్వతీ శతావధానితిరుపతివేంకటేశ్వరులచే
రచియింపఁబడిన పాణిగృహీతయందు

సర్వమును

షష్ఠాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము.



# నానారాజసందర్శనము.

ఈగ్రంథము పునర్ముద్రిణమగుచున్నది. సుమారు అయిదారు మాసములలో విక్రియమునకు సిద్ధమగును. ఇందు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు వెనుకటి గద్వాలాది సంస్థానాధీశ్వరులమీఁదఁ జెప్పిన పద్యములేగాక యిటీవల సందర్శించిన రాజులమీఁది పద్యములును, తిలకు మొదలగు దేశభక్తులమీఁద వ్రాసినవియు నితరపద్యములును క్రొత్తగా చేర్పఁబడినవి.

# కలగూరగంప.

చాలకాలముక్రిందనే ముద్రిణమునకుఁ బ్రారంభింపఁబడి, పా[illegible]కము ప్రోత్సహించుచున్నను కారణాంతరములచే నిప్పటివఱకు [illegible] ముద్రింపించుటకు వీలుకలుగలేదు. ఇందు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల చాటుపద్యములు, వ్యాసములు, ఉపన్యాసములు, విమర్శనములు, చేర్పఁబడినవి. ఈవిషయములను గ్రంథముయొక్క నామమే తెల్పును. ఇదియును నానారాజసందర్శనముతోఁ దుల్యమగునని చెప్పుటకు సందేహము లేదు. పుస్తకములు, మార్చి నెలాఖరునకు విక్రియమునకు సిద్ధమగును.

వలయువారు:- బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, శతావధాని, కడియము, తూర్పుగోదావరిజిల్లా. లేక దివాకర్ల వేంకటావధాని, దిగుమర్తివారివీధి, కాకినాడ. అని వ్రాసినచో బడయఁగలరు.